# చెలిసాలు



శ్రావణశ్రీ



జనతా ప్రచురణాలయం
విజయవాడ-2

# చెఱసాల

## 1

"పట్టుకోండి, పట్టుకోండి!"

రాజు వడివడిగా పరుగెత్తి పోతున్నాడు. అతని వెన్నంటి ఓ యిరవై - ముప్పైమంది మనోవేగంతో దూసుకు వస్తున్నారు. కేకలూ పెడబొబ్బలూ పెడుతూ అతనిమీద పడిపోడానికి మరింత దగ్గరగా వచ్చేస్తున్నారు.

రాజుకు కాళ్ళు తడబడ్డాయి. యింక ముందుకు పరుగెత్తడానికి అమితమైన 'రొప్పు' వచ్చేసింది. కళ్ళు తిరిగి కాళ్ళు తేలిపోతున్నాయి. అట్లాని జాగరణ చేస్తే ఆ గుంపు తనమీదికొచ్చి పడిపోతుంది.

రాజు గబాలున ప్రక్క నేవున్న ఓ ప్రహరీ తలుపు తోసుకొని ఆవరణలో ప్రవేశించాడు. ఎదురుగా రెండంతస్తుల డాబా వున్నది. గబుక్కున దక్షిణపు గోడను చాటు చేసుకొని - ప్రహరీకీ, డాబా గోడకీ మధ్యగల సందుగుండా కొంత దూరం వెళ్ళేసరికి దారి బందై పోయింది.

రాజు వణికిపోయాడు. తా నింక పట్టుబడిపోతా నేమోనని తల్లడిల్లిపోయాడు. ఆ గుంపు ఎలాగో యిక్క డికి వచ్చేస్తుంది. తన్నింక ఎముకల్లోకి సున్నం లేకుండా చేయడం ఖరారు.

రాజు ప్రాణంమీద ఆశ వదలుకొన్నాడు. 'ఎలారా దేవుడా' అనుకొంటూండగానే ప్రహరీగోడ నాన్చి కట్టిన బాత్ రూమ్ ఒకటి తన ప్రక్కనే కనిపించింది. దాని తలుపు కొద్దిగా తెరచుకొని వుండేసరికి గుండెలు గుప్పెట్లో పెట్టు కొని గబాలున దాంట్లోకి చొరబడ్డాడు. హఠాత్తుగా స్నానం చేస్తున్న ఎవరో స్త్రీ కెవ్వుమనబోయేసరికి చటు క్కున కండ్లు మూసుకొని ఆమె నోరుమూసి "క్షమించండి. నేను దొంగను కాదు. వ్యభిచారినీ కాదు, సోదరునిగా భావించండి" అంటూ ఆమెను బ్రతిమాలాడు. ఆమె చప్పున గోడమీదనున్న చీర చుట్టుకొని "ఏయ్ ఎవరు నువ్వు" అంది గద్దరింపుగా.

రాజు కళ్ళు తెరిచి అరవకూడదన్న సూచనగా దీన దృక్కులు సారించి "ఇష్!" అన్నాడు. ఆమె ఇంకా చీర కట్టుకోనే లేదు. భుజాలనుండి క్రిందివరకూ దుప్పటిలా కప్పుకొని వుంది. బుగ్గలమీద, నొసటిమీద, నీటిబిందువు లింకా తారాడుతూనే ఉన్నాయి. ఆమె ముఖమంతా భయంతో కంపించిపోతూ వుంది. ఆమె విశాల నేత్రాలు బెదిరి బెదిరి చూస్తున్నాయి.

"ఏమండీ! మీరు నన్ను రక్షించాలి. నేను దొంగను కాదన్నాను గాని చేసింది దొంగపనే. ఇదిగో

ఈ పర్సు, దారినే పోతూవున్న ఓ మనిషివద్ద బలవంతాన లాక్కున్నాను. వందరూపాయలున్నాయి."

"వందే! ఐతే యిప్పుడే వెళ్ళి చెప్పొస్తాను. నేను స్నానం చేస్తూవుంటే దొంగవై అదంతరంగా వచ్చిందిగాక యింకా రక్షించమంటావూ? ఆగు బైటకెళ్ళి పిలుస్తా...."

"ఏమండి. మీరు నా పరిస్థితి కాస్త అర్థం చేసుకోండి - మా అమ్మకు ధనుర్వాతమొచ్చి ప్రమాద స్థితిలో పడివుంది. డాక్టరు యిరవైరూపాయల యింజక్షన్లు వ్రాసిచ్చి వెంటనే తెమ్మన్నాడు. డబ్బెక్కడా దొరక లేదు..."

"అంచేత దారేపోయే వ్యక్తిపై" యిలా దౌర్జన్యం చేశానంటావ్...."

గత్యంతరంలేక తలవూపాడు రాజు. అక్కడ తన తల్లి ప్రమాద స్థితినీ - యిక్కడ తన ప్రాణాపాయస్థితినీ తలచుకొని కన్నీరు పెట్టాడు—

"ఏమండి, నాకు కావలసింది ఇరవయ్యే. తతిమ్మా ఎనభై యీ పర్సుతోసహా మీవద్ద వుంచుకోండి. ఎవరైనా యిటువస్తే నేనిక్కడ పారేసి పారిపోయినట్లు చెప్పి యివ్వండి" అంటూ చెయ్యి చాచి పర్సు అందించబోయాడు. ఏమనుకుందో! వద్దనకుండా పర్సు అందుకొని అతన్నక్కడే వుండమన్నట్లు కళ్ళతో సంజ్ఞచేసి నెమ్మదిగా తలుపు తోసుకొని వెలుపల కొచ్చింది. తిరిగి తలుపు దగ్గరకులాగి బైట గొళ్ళెంపెట్టింది. అప్పుడే యిరవైముప్పై మంది జనం సందుపట్టుకుండా యిటు వస్తున్నారు. వాళ్ళం

దాకి ముందు నడుస్తూ ఆమె తండ్రి ఓంకారయ్య ఎగాదిగా శ్వాసలతో వస్తున్నాడు.

"లలితా! యిటో దొంగవెధవొచ్చాడు, కనపడ లేదటే? అన్నాడు రొప్పు నాపుకొంటూ.

"లేదు నాన్నగారు. కాని ఇక్కడో పర్సుపడివుంది. మీాదే ననుకొంటా?"

"ఆరెయ్యో - నాదేనే. వెధవ వొట్టి పర్సు పారేసి ఆ గోడమీాకి పారిపోయుండేను."

"ఏమో నాన్నా, దీంట్లో డబ్బుందే మరి?"

ఓంకారయ్య చప్పునవ్చి కూతురువద్దనుంచి పర్సు తీసుకొని అందులో వున్నడబ్బు సెకన్లలో లెక్కపెట్టాడు.

"ఇంకో యిరవై వుండాలమ్మా—"

"ఏమో నాన్నగారూ - అందులో అంతేవుంది" అంది లలిత—

"పోన్లేమ్మ, మన సామ్మి గనక ఇంతవరకైనా దొరికింది ...దొంగవెధవ. పట్టపగ లెంతపనిచేశాడమ్మా- ఆ వెధ వెవడో జాడ తెలిస్తే డొక్క చీరేద్దును" అంటూ తన వెనకనున్న వాళ్ళందరికీ వెళ్ళిపొమ్మని సైగచేశాడు. వాళ్ళు కిమ్మనకుండా తిరోగమించారు. ఆ వెనుక ఓంకా రయ్య కూడా "మన సామ్మికనక మనకు దక్కింది" అను కుంటూ దక్షిణ గుమ్మంనుంచి మేడలోకి వెళ్ళిపోయాడు.

అలా నాన్న లోన గదుల్లోకి వెళ్ళేవరకూ లలిత అక్కడే నిలబడి, ఆ పైన మెల్లగా బాత్ రూం తలుపుతీసి

లోనికి వచ్చింది. రాజు కుంచుకుపోయి ఓ మూలన ఒదిగి నిలబడి వున్నాడు. ఆమె లోనికి రావడంతో కొద్దిగా ధైర్యం వచ్చినా మొత్తంమీద 'దడ' మట్టుకు యింకా తగ్గలేదు.

"మొత్తానికి మానాన్నకే ఎసరుపెట్టావు!" అంది.

రాజు నోరు విప్పలేకపోయాడు; ఇంక ఆమె అధికంగా మాట్లాడటానికి యిష్టపడనట్లు.

"వెళ్ళు" గొంతుమార్చి చేయెత్తి దారిచూపించింది- రాజు జంకుతూ గొంకుతూ నెంపాదిగా బాత్‌రూం యివతల కొచ్చాడు. ఆమె అతనికన్నా ముందువెళ్ళి దార్లన్నీ పారజూచి త్వరగా పొమ్మంది.

ఆ మాటతో అతని కెక్కడలేని సత్తువ వచ్చినట్టయింది. ఆమె వుపకారబుద్ధికి చేతులెత్తి నమస్కరించి చరచరా ఆవరణదాటి వీధిని పడ్డాడు. తను కొనవలసిన యింజక్షన్లన్నీ కొనేసి పరుగు పరుగున యింటికొచ్చాడు.

ఇంతవరకూ తనకొరకు ఉపేక్షించివున్న డాక్టరు చిన్నబోయి, వాకిట్లో తలవాల్చి నిలబడివున్నాడు

"ఏం డాక్టర్! అలా వున్నారు. అమ్మకెలావుంది?" అన్నాడు ఆదుర్దాగా.

డాక్టరు చాలాసేపు మాట్లాడలేదు.

"నిన్ను తెమ్మన్న ఇంజక్షన్లు నేనే తెప్పించి చేశాను." అంటూ వెళ్ళిపోయాడు.

రాజు ఈ సందిగ్ధాన్ని భరించలేకపోయాడు. వెంటనే యింట్లోకి వెళ్ళి కొయ్యబారిపోయాడు. "అమ్మ" నిమీలనేత్రాలతో మంచంమీద వెల్లకిలా పడివున్న తల్లిపై కొరిగిపోయాడు. "అమ్మా; అమ్మా" అని ఎంత పిలిచినా, ఎంత కదిపినా అమ్మ మాట్లాడలేదు. కదలలేదు. అమ్మ శాశ్వత నిద్రలో మునిగిపోయింది. ఎన్నో ఆశలు పెట్టుకొన్న అమ్మ దక్కకుండా పోయింది. తన జీవనబాటల్లో కొంగ్రొత్త వెలుగులు విరజిమ్ముతూ దివ్వటీయై వెలిగిన తల్లి తరలిపోయింది.

రాజు జీవితం అంధకార బంధురమై పోయింది.

## 2

ఓంకారయ్య మేడపై వరండాలో పడకకుర్చీలో కూర్చుని విసనకర్రతో విసరుకొంటూ వున్నాడు. ప్రక్కనే వున్న మడతమంచంపై లలిత వెల్లకిలా పండుకొని మోకాళ్ళు పైకివుండేలా పెట్టి ఏదో వారపత్రిక చదువుకొంటూ వుంది. ఓంకారయ్యకెదురుగా అతని భార్య చంద్రమతి చిరుసోఫాపై కూర్చుని భర్త విసుగుకోవడాన్ని చిరునగవుతో తిలకిస్తూవుంది. వాళ్ళకు కొంచెం దూరంగా పనివాడైన కోటయ్య ఏంపని చెప్పతారోనన్న 'యావ'తో తచ్చాడుతున్నాడు.

సరిగా అదే సమయానికి వో వ్యక్తి చరచరా అక్కడికి వచ్చి ఆగిపోయాడు. కోటయ్య మర్యాదగా నమస్కరించి కొంచెం ప్రక్కకు తప్పుకొన్నాడు. పడకకుర్చీలో వాలబడివున్న ఓంకారయ్య రుసరుసలాడుతూ విసనకర్ర ప్రక్కకు గిరవాటుకొట్టి వుగ్రుడై లేచాడు. అదేమిటో బోధపడక చంద్రమతి బిత్తరపోతూ చప్పున లేచి మేడ గదిలోకి వెళ్ళిపోయింది. యిదేమీ గమనించకుండా నే లలిత తన ధోరణిలో తను మునిగివుంది.

"ఒరేయ్ కోటిగా, ఆ దొంగ వెధవను పట్టి కట్టేసి చావకొట్టండిరా!" అంటూ గర్జించి కోటయ్యకూ, అప్పుడే పైకివచ్చిన పాలేరు పుల్లిగాడికీ కనుసన్న చేశాడు. కోటయ్య కదల్లేదుగాని, పుల్లిగాడు బుసకొడుతూ కలబడి వాటేసుకోబోయాడు. అతను వాణ్ణి దగ్గరకు చేరనీయకుండా చెలిగాడు.

"బాబుగోరు, ఆయన మంచోడు" అంటూ కోటయ్య ఆ వ్యక్తికేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

ఇంతకూ ఆ వ్యక్తి ఎవరో కాదు. రాజ! తల్లి ప్రాణాలు నిలబెట్టుకోటానికి దౌర్జన్యంచేసి డబ్బు సంపాదించాడు. ఐనా, తన తల్లి ప్రాణాలు దక్కలేదు. ఆ డబ్బుతో కొన్న ఇంజక్షనులు తిరిగి షాపువాని కిచ్చేసి ఆ యిరవైరూపాయలూ ఎవరివద్ద దౌర్జన్యంగా లాక్కొన్నాడో వాళ్లకు తిరిగి యిచ్చివేయడానికొచ్చాడు.

"అయ్యా - నాకు మీ యిష్టమొచ్చిన శిక్ష విధించమనే తమ వద్ద కొచ్చాను. నా తల్లి ప్రాణాలు రక్షించు

కోడానికి మీ పర్సులోని యిరవై రూపాయలు తీసుకొన్నాను. నా తల్లి చచ్చిపోయింది. ఈ డబ్బుతో యింక అవుసరం లేకపోయింది. ఇవిగో! తీసుకోండి" అంటూ దగ్గర కెళ్ళబోతే, ఓంకారయ్య బెదురుతూ వెనక్కి పోతూ "నాకొద్దు; పుల్లిగాడిచేతికిస్తే వాడేయిస్తాడు నాకు" అంటూ వాణ్ణి చూపించాడు. రాజు ఆ డబ్బును వాడిచేతి కిచ్చాడు. ఇంతవరకూ చదువుతూన్నట్లు నటిస్తూ ఇదంతా వింటూవున్న లలిత చటుక్కున పత్రిక అక్కడ పడవేసి లేచింది. అతనివేపు కటువుగా దృష్టిని పోనిచ్చినా ఆముఖంలో గూడుకట్టుకొని శాశ్వతంగా నిలిచిపోయినట్లున్న విషాదరేఖలు ఆమె హృదయాన్ని కదిలించివేశాయి. మాతృవియోగంతో అతను నఖశిఖపర్యంతం పడుతూన్న సంక్షోభను గమనించి,

"పాపం మంచివాడిలాగున్నాడే!" అనుకొంది.

"ఎవరికైనా ఎప్పుడైనా ఆపదవస్తే అలాగే చేస్తూ వుంటావా?" అంది. ఇది రాజుకు అర్థంకాని ప్రశ్నలా తోచింది. ఐనా ఏదో ఒకటి చెప్పడం వుచిత మనుకొన్నాడు.

"సాధ్యమైనంతవరకు—"

"అంటే ఎలాంటి అఘాయిత్యమైనా చేస్తావన్నమాటేగా."

"పూర్తిగా కాదనలే ననుకోండి — నా తల్లిలాంటి ప్రాణాపాయ పరిస్థితి ఎవరికన్నా కలిగితే సాయం చేయడానికి ప్రాణమైనా అర్పిస్తా."

లలిత అతని మాటల ధోరణికి మెచ్చుకొంది. అతని పలుకులోని నిశ్చలత, గాంభీర్యం, ఆమెను ఉల్లాస పరిచింది. తోటి వ్యక్తిపై అతని కెంత విశ్వాసం, ప్రేమ అనేవి వున్నవో, యితరులపట్ల అతనెంత నిస్వార్థపరుడో వూహించుకొనగలిగింది.

"ఎదుట నుంచుని నిన్నేం చెయ్యకపోబట్టే హద్దు మీరి మాట్లాడుతున్నావ్? నిన్నసలు గుంజకు వేళ్ళాడ దీయవలసింది. నీరోజు మంచిదైంది. ఇంక మాట్లాడకుండా వెళ్ళిపో—"

రాజు వెనక్కి తిరిగాడు - తన మనస్సులోని ఆవేదన వెళ్ళగక్కుకోడానికి అవకాశం దొరుకుతుందేమోనని అనేకరీతుల ప్రయత్నించాడు గాని, యిది సమయం కాదనుకొన్నాడు. అదీగాక తను దౌర్జన్యంచేసి లాక్కున్న డబ్బును తిరిగియిచ్చివేయడమే ధ్యేయంగా పెట్టుకొన్నాడు.

కనుక, కిమ్మనకుండా చిన్నగా కదిలి క్రిందికి దిగిపోడానికి మెట్లవద్దకు చేరుకొని ఒక్కో మెట్టే దిగుతున్నాడు- చప్పున మెట్లు కెదురుగావున్న గది తలుపులు తెరచుకొని వెనుకనుంచి స్త్రీ గొంతు పిలచినట్లు వినపడింది వెనక్కి తిరిగాడు. ముద్దుల మూటగట్టినట్లు నొష్టన తిలకపద్ది, లలిత ప్రసన్నవదనంతో గుమ్మంలో నిలబడి రెండుచేతులూ చెర యొక వేపున దర్వాజాకమ్ముల కాన్చి, "వెళ్ళిపోతున్నారా?" అంది చిరునవ్వులొలికిస్తూ.

"ఔనండి-"

"పేరు తెలుసుకోవచ్చునా?"

"రాజు."

"ఇదిగో రాజు. డబ్బు లేనప్పుడు ఎలాంటి అఘాయిత్యానికీ దిగవద్దు. మాలాంటివాళ్ళనుకూడా ఆలాంటి సమయాల్లో గుర్తు తెచ్చుకోడం మంచిది—"

తనేదో అనబోయాడు. అంతలోకి వాళ్ళమ్మ, ఏమిటే, అంటూ అక్కడికొచ్చేసరికి ఏమీలేదంటూ లోనికి వెళ్ళిపోయింది. ఇంకాసేపు ఆమె అక్కడేవుంటే సంభాషణ తీరెలాగుండేదోగాని, ఆమె వెళ్ళిపోవడంతో కాస్త నిరాశ పడి ఒక్కో మెట్టే నెమ్మదిగా దిగి కదిలిపోయాడు.

రాజు నిరుపేద కుటుంబంలో పుట్టినవాడు. తెలిసీ తెలీని వయస్సులోనే తండ్రి గతించాడు. అష్టకష్టాలుపడి తల్లి తన్ని పెద్దవాణ్ణిచేసి ప్రతిపనికి సహాయంగా తీసుకు వెళ్ళేది. పాఠశాలకువెళ్ళి డిగ్రీలుపొందే అదృష్టం లేకపోయినా తల్లిపుణ్యమా అంటూ చదవనూ వ్రాయనూ బాగా వచ్చింది. భారత రామాయణంలాంటి యితిహాసగ్రంథాలను అనర్గళంగా చదివి వ్రాయగల ప్రతిభ ఏనాడో అబ్బింది. క్షణం బీరుపోకుండా ప్రతిరోజూ ఏదో కూలిపనికి తనను వెంటదీసుకు వెళ్ళడం; రాత్రిళ్ళు పదిన్నరవరకు తనకు విద్య గరపడం దైనందిన కృత్యమైపోయింది. అలా మూడేళ్ళు తనకై తాను తంటాలుపడి చక్కనివిద్యను చేకూర్చిపెట్టింది. ఇప్పుడు రాజుకు ఇరవయ్యోయేడు. యీ ఇరవైఏండ్ల జీవితంలో తల్లితోపాటు తిరుగుతూ—పనిచేస్తూ

ఎన్నో సంగతులు నేర్చుకొన్నాడు. ఎన్నో సంఘటనలు కళ్ళజూశాడు.

తల్లి, కూలీలమధ్య పనిచేస్తూ వళ్ళువిరుచుకొని పని చేసే తోటికూలీలనుచూచి తెగ జాలిపడేది. "ముప్పావలా కూలికోసం రెక్కలు ముక్కలు చేసుకొంటున్నాం. ఆ యిచ్చేది చాలదని ఆసామినెందుకడిగి పుచ్చుకో కూడదూ?" అని అందరినీ ఆవేశ పరిచేది. కూలీంలలో చంచలనం లేవనెత్తేది కానీ, ఆసామికి ఎదురుచెప్పలేక, చెప్పితే రేపు తిరిగి పనిలోనికి పిలువడేమో నన్న భయంచేత అందరూ మూగగా వుండిపోయేవాళ్ళు. ఆ పైనింక ఆవిడే తెగబడి అడిగేసేది. ఆసామి భగ్గునమండిపడి ఆమెనప్పుడే పనినుంచి వెళ్ళగొట్టేవాడు. 'అందరికీ చాలంగాలేంది, నీ వొక్కర్తెవేనా అంతచాలక చచ్చేది! నువ్వు పడేపాటుకు అదికూడా దండుగే!' అంటూ అరవళ్ళు పరవళ్ళు తొక్కేవాడు. ఆ మరునాటినుంచీ అమ్మ ఆ ఆసామి చేనులో అడుగెట్టేదికాదు! మరొకళ్ళపనికెళ్ళినా ఇదే సమస్య లేవదీసి ఇలాగే ఇంటికొచ్చేసేది.

అమ్మ, కష్టఫలితాన్నెప్పుడూ సరిగా యింటికి తెచ్చుకోనేలేదు. అట్లని ఆమె చింతించేదికాదు. తనెప్పుడూ తన తోటి కూలీలనుగూర్చే ఆలోచిస్తూ దరిగాంచక సతమతమైపోతుండేది.

తల్లి యిలా ఎందుకు పాటుపడుతుండేదో, ఎవ్వరికి లేని కంఠశోష ఆమెకెందుకో అప్పటికింకా తనకు అంతగా అర్థమయ్యేదికాదు. తీరా తను పెద్దవాడైనకొద్దీ అమ్మ

వాంఛితాభిప్రాయం చెప్పకుండానే పసికట్టేశాడు. కూలి రేట్ల నిర్ణయంకోసం ఆమె ఎంతగా సతమతమై చివాట్లూ, చెప్పుదెబ్బలూ తినేదో తనకు తెలిసివచ్చింది. ఐనా ఆవిడేం చేస్తుంది? ఒక్కర్తే. అందులోనూ, అన్నివిధాలా అబల! ఆడది!!

కాని, తనని నిత్యం ఆవరిస్తున్న విచారమల్లా ఒక్కటే! తల్లి చనిపోయింది; పుట్టటం గిట్టటం మానవ సహజం. కానీ, మృత్యుశయ్యపై వున్నప్పుడు - ప్రాణం పోయే తుదిక్షణాన దగ్గరలేకపోయానే అన్నదే విచారం. అది తనకే కాదు. మృత్యు గహ్వరంలోకి అడుగిడుతున్న వ్యక్తి కాలూను బంధుపరివారం తుదివాఙ్మూలం వినడానికి ఎలా తహతహపడుతారో, అలాంటి 'తహతహే' రాజుకూ ఏర్పడింది తనేగనక దగ్గరవుంటే అమ్మ ఏం చెప్పేదో!?

రాజు కెటూ పాలుపోవడంలేదు. నట్టింటకూర్చుని వాకిట్లోకి చూస్తూవున్నాడు. అంతలోనే మెల్లమెల్లని అడుగులతో అరవైఏండ్ల పైబడ్డ వయస్సులోవున్న ఓ వ్యక్తి లోపికివచ్చాడు. ఆ వ్యక్తి వయోభారంతో కొద్దిగా వంగబడివున్నాడు. తలవెంట్రుకలు బొత్తిగా నెరసిపోయినా, అక్కడక్కడా కొన్నినల్లనివి కొట్టవచ్చినట్లు కానవస్తు న్నాయి

"బాబు! అట్టా కూసుంటావే!" అన్నాడా వ్యక్తి తన వీపుతట్టి-

రాజు కొద్దిగా వులిక్కిపడి ఆ వ్యక్తిని చూచి "అ!!

మిరప వగైరా అన్నీ కొని, యిద్దరు కడుపారా భోంచేయ గలుగుతారా ? ఇదేనా మానవ పురోగతి !

రాజు ఆ రాత్రి కోటయ్య తాతతో సహా హరిజన వాడ, కుమ్మరిపేట, యాదవ, రజక, నా యీ బ్రాహ్మణ పేట లన్నీ తిరిగి ఓ బహిరంగ స్థలంలో మీటింగు ఏర్పాటు చేశాడు. మీటింగుకు జనం బాగా వచ్చారు ....

రాజు వేదికమీద నిలబడి యిలా చెప్పాడు: "మీ రందరూ రెక్కాడితేనే డొక్కాడించుకొనేవాళ్ళు. ఏదో ఒక పనిచెయ్యందే మీ పొట్టగడవదు. కనీసం మీమీ వృత్తిపనైనా చేయందే ఏరోజూ వుండలేరు. ఆ రోజు ఆపని చెయ్యకపోతే ఏమిటో జెర్రులు ప్రాకినట్లుంటుంది.

"ఐతే, ఆ చేసేఁవృత్తి పనితోనే మీ భుక్తిగడు స్తుందా అంటే అదీ లేదు. మీ ఆడంగుల్లో, మీ పిల్లల్లో, పొలం కూలిపని కెళ్ళి తీరవలసిందే. ఇందుల్లో కేవలం కూలిపనిమీదనే ఆధారపడి జీవించేవారు చాలా మంది వున్నారు. అలాంటప్పుడు మీరు ఆసామినుండి పొందే ప్రతిఫలం మీ కష్టానికి సరిపోతుందేమో అంచనా వేసుకోండి? ప్రతిదానికి ధరలు పెరిగిపోయి జీవనసమస్య దుర్భరమౌతున్న యీ నాడు ఆ యిచ్చేకూలి ఎంతమంది ఆకలి తీరుస్తోందో చెప్పండి...." కాసేపు ఆగి వాళ్ళందరినీ తిలకించాడు. అందరూ మౌనముద్రితులైన ముఖాలతో శ్రద్ధగా వింటున్నారు. -

రాజుమళ్ళీ ప్రారంభించాడు.

"అంచేత మీకు పదే పదే చెప్పేదేమిటంటే,

ముప్పావలా కూలికోసం మీ రెవ్వరూ పరుగులెత్త
వొద్దు. మొగమనిషికి రెండున్నర — ఆడమనిషికి రెండు
రూపాయిలూ యిస్తేనే పనికివెళ్ళండి. అందాకా ఎవరు
పిలిచినా ఒక్క పిట్టకదలవద్దు-ఏం జరుగుతుందో చూద్దాం-?!''
అంటూ తన వుపన్యాసం ఆపేసి వాళ్ళజవాబుకై ఆత్రంగా
చూశాడు. అందరూ బెలబెలమంటూ వుత్సాహంగా
లేచారు——చేతులు హుషారుగా గాలిలో ఆడిస్తూ ''రాజ
బాబు గార్కి జై!'' అన్నారు ఒకేగొంతుతో - ఆ నినాదం
దిగంతాలను చుట్టివచ్చిందా అన్నంత భయంకరంగా విని
పించింది.

## 3

ఆ వ్వాళ వుదయంనుంచి ఓంకారయ్యగారి మేడ
క్రింది అంతస్తులో ఆయన అధ్వర్యాన పెద్దసభ జరుగు
తోంది. ఆ గ్రామంలోని బడాబడా ఆసాములంతా అందులో
పాల్గొన్నారు. అందరిలోనూ ఏదో ఉద్దేశం వుట్టిపడుతూంది.
వాళ్ళకంతదూరంలో గడ్డంకింద కర్రబెట్టుకొని, గోడకు
జార్లబడి పుల్లిగాడు నిలబడివున్నాడు. వాడికింకొంచం
ఎడంగా కోటయ్య నిలబడివున్నాడు——వాడి ముఖంలో
నెత్తురుచుక్క లేదు. బంధించి బలవంతంగా తెచ్చినట్టుంది
వాడిముఖం.

"ఒరే పుల్లిగా! రాత్రి కోటిగాడు మీటింగులో వుండటం నువ్వు చూశావా?" అని అడిగాడు ఓంకారయ్య.

"చూసినానండి-"

ఓంకారయ్య కోటయ్యకేసి తిరిగి "ఉన్నది నిజమే నట్రా" అన్నాడు.

"నే నెరుగను దొరా. అట్టాటాటితో నాకేటి సంబందీకం?"

"ఒరేయ్. పుల్లిగా అబద్ధమాడకు. నిజమెప్పుకో. లేకపోతే వీళ్ళంతా నీ మీదపడి తోలు వొలుస్తారు. అంత వరకూ రానీయకు-"

"చంపండి దొరా, నేనబద్ధమాడేది లేదు."

ఆ మాటతో అందరూ వాడిమీదికి విరుచుకుపడి కొట్టబోయారుగాని, ఓంకారయ్య అందర్నీ సద్ది కూర్చోబెట్టాడు.

"సరే. ఇంక నువ్వెళ్ళి నీ పని చూచుకో."

కోటయ్య వెలుపల కొచ్చేశాడు-పుల్లి తలుపులు దగ్గరకేసి వచ్చేశాడు, ఓంకారయ్య ఆదేశంతో-

"మనం ముప్పావలా కూలికన్నా ఎక్కువివ్వద్దు. వాళ్ళెన్ని నిర్ణయాలు చేసినా, మన్ని చేసేదేమీ లేదు. వాళ్ళు కాకపోతే, తాతల్లాంటివాళ్లను రప్పించి చేయించుకోవచ్చు. మన పనులు ఆగిపోతయ్యేనన్న బెంగ మీ రేం పెట్టుకోవద్దు" అన్నాడు ఓంకారయ్య. హఠాత్తుగా అందులోంచి ఒకవ్యక్తి

లేచి "అసలింతకూ యీ సంచలనాన్ని తీసుకొచ్చిందెవరు?" అన్నాడు.

"ఒకడున్నాడులే. దొంగ వెధవ. వాడి పేరు రాజు. అతగాడు రాత్రి మీటింగుపెట్టి రెండు, రెండున్నర యిస్తేనే పని కెళ్లండని రెచ్చగొట్టాడట."

"అసలు వీడి భరతం పడితేనే బాగుంటుందేమో."

"సరే, అలాంటి మాటలు ఈ సందర్భంలో అనవసరం. నేను చివరికి చెప్పేదొక్కటే ఒక్క మాట. మీ రాముప్పావలా కూలి కంటే పైసా పెచ్చివ్వద్దు. ఏం జరుగుతుందో చూద్దాం"

సరేనంటే సరేనని అందరూ లేచి వెళ్ళిపోయారు. వాళ్ళ చేతులు కడిగేదుతుండమని పుల్లిగాడికి చెప్పి పైకొచ్చాడు. అక్కడ కోటయ్య కాలు గాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. ఓంకారయ్యకు కోపం వచ్చింది.

"ఏంరా ? నీకు పనేం లేదా ? యీ యింట్లో నిన్ను పెట్టుకున్న దెందుకురా దండుగ ! పో ! వెళ్ళి ఏదన్నా పని తగలబెట్టు !" అని కసిరాడు. కోటయ్య జాట బాటా కారుతున్న కన్నీళ్ళు కళ్ళల్లోనే కుక్కుకొని క్రిందికి వచ్చాడు. అప్పుడే పైకెళ్ళబోతున్న లలిత ఎదురై "ఏమిటి కోటయ్యా అలాగున్నావ్?" అనడిగింది. కోటయ్యకు మాట రాలేదు.

"ఏూం లేదమ్మ" అన్నాడు అతి బలవంతాన నోరు విప్పి, "అలా చెప్పుకోను. ఏదైనా కారణ ముంటేనే నువ్వు అలా 'మూడు' ముఖం పెడతావు. లేకపోతే నీ ముఖం ఎప్పుడూ నవ్వుతూంటుంది.ఏం జరిగిందో చెప్పు"అంది లలిత.

"నా మాట నమ్మండమ్మా ఏమీ లేదన్నానుగా?"

చెప్పందే కదలనన్నట్టు, లలిత అక్కడే నిలబడి పోయింది. ఇక లాభం లేదనుకుని కోటయ్య చెప్పడానికే వుద్యుక్తుడయ్యాడు.

"రాత్రి రాజు బాబు పనీ పాటా చేసుకునే వాళ్లందరినీ పిల్చి ఓమీటింగెట్టాడమ్మా. ముప్పావలా కూలిసాలదూ! రెండూ, రెండున్నర యిస్తేనే పని కెళ్ళమని చెప్పేడు. ఆ సంగతి అయ్యగారికి తెలిసి అక్కడ నేనూ వున్నానని దండెత్తుతుండారు. పాపం రాజు బాబును కొట్టాలని కూడా ఆలోచన చేత్తుండారమ్మా" అన్నాడు.

కూలి రేట్ల నిర్ణయం సంగతెలాగున్న రాజును కొట్టించడమన్న ప్రస్తావనవచ్చేసరికి లలిత వళ్ళు కంపించిపోయింది. ఆమె ఇంక అక్కడ ఆగలేకపోయింది. చరచరా మెట్లెక్కి హుక్కా పీలుస్తూవున్న తండ్రిచెంతకొచ్చి ఏదో అడగాలని అడగలేక నిలబడిపోయింది. ఓంకారయ్య హుక్కా ఆర్పి, వాలబడికూర్చున్న పేముకుర్చీనుంచి లేచి కూతుర్ని కూర్చోమని ప్రక్కనేవున్న మడత మంచంమీదకెళ్ళి తను కూర్చున్నారు. ఈ అతిమర్యాదకు-లోలోన ఒళ్ళుమండినా పైకి ఏమీ ఎరుగనట్లు "నాకు దాంట్లో కూర్చోడం అంతగా అలవాటులేదు. మీరే కూర్చోండి నాన్నా - నేనా సోఫా మీద కూర్చుంటాను" అంటూ అక్కడే వున్న సోఫా మీద హాయిగ్గా కూర్చుంది

"నాన్నా?" ఏమిటిందాక క్రింద మీరు పెట్టిన మీటింగు" అడిగింది.

"అదా! మొన్నీమధ్య యిక్కడికొచ్చాడు చూశావ్, ఆ బకుధ్ధాయి; మనమిచ్చే ముప్పావలాకూలి తీసుకోవద్దని కూలివాళ్ళందరినీ కూడగడుతున్నాట్ట; అంచేత మేమంత కన్నా పైసా ఎక్కువిచ్చేదిలేదని మీటింగు పెట్టి నిర్ణయించుకొన్నాం."

ఇంత కలిగివుండికూడా నాన్న అంత పిసినిగొట్టు మాటంటున్నాడంటే ఆమె కెలాగో వుంది. చాలీ చాలని కూలితో ఎంతమంది సతమతమవుతున్నారు? వాళ్ళకు సరైన తిండీ, బట్ట వుందా? రోగం రొప్పులొస్తే వాళ్ళను చూచే నాధుడున్నాడా? పగలల్లా రెక్కలు ముక్కలు చేసుకొని ముప్పావలా డబ్బులతో వాళ్ళ జీవనోపాధి జరుగుతుందా?

ఇలాంటి అతని కృష్టపరిస్థితినిగూర్చి యోచన చేయక ముప్పావలాకంటే ఎక్కువిచ్చేది లేదని నాన్న వాళ్ళ పట్ల ఎంత కఠినంగా ప్రవర్తిస్తున్నాడు!

లలిత యింక తనమనసులోనిది ఆపుకో లేకపోయింది. తండ్రి నిర్ణయాన్ని తను ఖచ్చితంగా ఖండించాలనుకొంది.

"మీ నిర్ణయం నాకేం నచ్చలేదు నాన్నా! మన యిష్టమొచ్చినట్లు పనిచేయించుకొంటున్నప్పుడు మనిషికి రెండున్నర కాదు; మూడిస్తేమట్టుకు దండగేమిటి?" హఠాత్తుగా ఓంకారయ్య వులిక్కిపడ్డాడు. అతనిదృష్టి క్షూతురి ఆ పాదమస్తకాన్ని ఆవరించి, ఏమిటో వెదుకుతున్నట్లనిపించింది.

"నీకేం తెలీదు, నువ్వింకా పసిదానవు. మా నిర్ణయం తప్పదు" అన్నాడు, కళ్ళెర్ర జేసి- ఆమెకూ-అంతకన్న మిన్నగానే ఆ వేళ మొచ్చింది. తానేంచిన్న దా చితక దా! పద్దెనిమిదేళ్ళు దాటుతుంటే ఇంకా పసిదానిలా చూడటమేమిటి? అనుకొంది.

ఐనా తమాయించుకొని "నేను పసిదాన్నిగానే చెపుతున్నాను నాన్నా. మీ నిర్ణయాన్ని మార్చుకోవాలి. వాళ్ళడిగిన కూలియివ్వడమే న్యాయం" అంది.

"నేర్చుకొన్నావ్, కొంపకూల్చే నీతులు? చాల్లే యింక నోరుముయ్."

"ఏమిటండీ అమ్మాయిని నోర్ముయ్ మంటున్నారు-" అంటూ చరాలున చంద్రమతివచ్చి నిలబడింది.

"అనకేం జేస్తాను. ఆ మాల, మాదిగ, చాకలి మంగలి వెధవలంతా రోజుకూలి ముప్పావలా చాలదనుకున్నారట! రెండున్నర ఖరా ఖండీగా యిస్తేనే పనికెళ్ళాలని నిర్ణయించుకొన్నారట - ఆ వెధవలకు యిదే మోసం పలుకుతూంది."

"ఐతే అమ్మాయి అంత యివ్వమనేనా అంటోంది?"

"మరేమనుకొన్నావ్? చిన్నకాణ్ణుంచి ఏమీ తోయ్యాదంలా."

"ఐతే నాకూ, ఏదో ఒక పని అప్పజెప్పండి నాన్నా! చేస్తాను. మీతో ఆ మాటెందుకనిపించుకోవాలి_"

"ఊరుకోండి-ఊళ్ళోవాటిని గురించి తండ్రీకూతుళ్ళ మధ్య జగడం ఎందుకు? ఏం తల్లీ, నాన్నలాచేస్తే

నీ కెందుకు? వాళ్ళకి రెండుసార్లు కూలిస్తే యింక మన మాటింటారా!"

"చాల్లేమ్మా. నువ్వూ నాన్నను వెనకేసుకొస్తున్నావ్-ఇంకా వాళ్ళను మాడిచావమనేగా నువ్వనేది? అంతా మనలాంటి మనుష్యులే అనుకోవాలి" అంటూ లేచి క్రిందకు దిగిపోయింది.

ఆమె అలా విసురుగా వెళ్ళడంచూసి తల్లి చంద్రమతి "ఒట్టిపిచ్చిపిల్ల! దానికేం తెలుసులెండి" అంది.

"నీకూ ఏం తెలీదు. నిన్న మొన్ననే పుట్టిన పసిపిల్లలు" అంటూ కసిరాడు.

ఆ మాటతో ఆమె నోటికి కూడా తాళం పడింది.

## 4

రాజు తన వుద్దేశాలను వ్యక్తపరుస్తూ సలహాలకోసం మిత్రులకు ఉత్తరాలు వ్రాసుకుంటున్నాడు. ఇంతలో తలుపు తోసుకొని పొరుగింటి రాందాసు చడీ చప్పుడు లేకుండా వచ్చి తన వ్రాతకు భంగం కలిగించకుండా మౌనంగా నిలబడి వున్నాడు.

"ఏం రాందాసు పనిమీద వచ్చావ్ ?" అన్నాడు రాజు, అతను వచ్చి నిలబడ్డం చూసి.

"ఏం చెప్పను బాబూ, కూటికి జరగటంలా.

తవురు చెప్పిన కండిషను మీాద ఎవరూ పిలవటంలా. చానా మంది ఆ ముప్పావలాకే ఎల్తోత్తుండారు."

"వాట్టి మూర్ఖులు. చెప్పినా వినని వాళ్ళను ఎవరేం చేస్తారు. అడపా దడపా నీలా సీతికి నిలబడ్డవాళ్ళ పరిస్థితి గడ్డుగానే వుంటుంది నారి. అందరికీ కనువిప్పు నిజస్థితి కళ్ళకు కట్టినట్లు బయల్పడే రోజొకటుందని వాళ్ళే గ్రహిస్తారు ఒకనాటికి–"అంటూ వుత్తరాలు వ్రాయడం ముగించి వాటిని జేబులో పెట్టుకొంటూండగా హరిజనవాడ నుంచి ఏసోబు వచ్చాడు. ఇతనే హరిజనవాడలో కాస్త తెలగల వాడు. ఇతను చెప్పింది వేదమన్నట్లు తు. చ. తప్పకుండా వాళ్ళందరూ పాటిస్తారు. ఇతని చేతిలో ఎప్పుడూ అరవై, డెబ్బై మంది కూలీలను బెట్టుకొని ఏదో ఒక పని చేయిస్తూ వుంటాడు. వాళ్ళు వేలుపెట్టని పనంటూ ఏదీ లేదు.

"ఏం ఏసోబు? ఏమిటి సంగతులు. ఎలా ఎలా వుంటున్నారు?"

"తవురుదయవల్ల బాగానే వుంటుండాం బాబయ్యా"

"మీారు పని పాటలకు బాగా వెళుతున్నారా?"

"ఎక్కడ బాబయ్యా. యీసాకాలం యీం పన్నుండయ్! వుండా అడిగిన కూలి కెవురూ అచ్చేలోలా. ఇయ్యాల ఇంతకుముందే ఓంకారయ్య పాలేరు పుల్లిగాడొచ్చి 'అళ్ళ దొరోరి పదెకరాల పొలంలో మొరక పన్నుండయ్! వొత్తారా' అని అడిగాడు— కూలి రేటడిగితే ముప్పావలా, పద్ధాలగడా లిత్తామని శెప్పేడు..."

"మరి మీ రేమన్నారు ?" వుత్కంఠతో అడిగాడు రాజు

"రెండూ, రెండున్నర యిత్తేనేవొత్తాం - అదైనా పొద్దున్న ఆరున్నరనుంచి మద్దేనం వొంటిగంటకన్నా ఎక్కువసేపు శెయ్యం అని శెప్పేను. కనుక్కొత్తానని ఎల్లి ఇంకా రాలేదు-"

"సరే. ఇంకావొచ్చేది నిజమే!" అంటూ రాందా సెళ్ళబోతే కాసేపు తాళివెళ్ళమని రాజు ఆపుజేశాడు. అంతలో వెలుపలనుంచి ఏసోబునుద్దేశించి ఎవరో కేకవేస్తే వాడు వెలుపలకెళ్ళి మరుక్షణంలోనే పుల్లిగాణ్ణి వెంటబెట్టుకొని లోనికొచ్చాడు. రాజు వాడివేపు ఉరిమి చూశాడు గాని తన ఇంటికొచ్చినవాడిపై అలాంటిచూపులు విసరడం సమంజసం కాదని వూరుకొన్నాడు. వాడూ తన చూపుతో వంటినిండా తేళ్ళూ జెర్రులూ ప్రాకినట్లయి లోనికెందుకొచ్చానా అన్నట్లు తచ్చాడుతున్నాడు.

"ఏమైంది ఏసోబు ?" అన్నాడు రాజు.

"అచ్చుకొన్నాడంట బాబూ, ఇంక మనం పనిలోకెల్లడమే ఆలిసెం."

"ఇంకేం రాందాసు నువుకూడా రేపెంత మందిని తీసుకొస్తావో తీసుకురా. ఏసోబు- నీ ముఠా ఎంతమంది ?"

"డజైను"

"సరే. అందర్నీ తీసుకురండి. ఒక్కర్నీ మిగల్చొద్దు. వచ్చినట్టుకేన వస్తుంది. నేనూ మీతో పాటే వుంటా- ఇదుగో.... పుల్లీ! వెళ్ళి మీ దొరకు చెప్పు.... రేపు పని

లోకి వస్తామని—" పుల్లిగాడు సందు దొరకనే దొరికిందని తుర్రున జారుకొన్నాడు. ఆ వెనుక రాందాసూ, ఏసోబులు కూడా సెలవు తీసుకొని వెళ్ళిపోయారు....

మర్నాటి పొద్దయం ఐదున్నరా, ఆరింటి కల్లా ఓంకారయ్య తూరుప్పొలంలో కూలీలు కిటకిట లాడు తున్నారు. అంతా కలసి ఓ వందం బాతిక మందుంటారని రాజు అంచనా వేసుకొన్నాడు. అందులో మూడొంతులు మొగా, రెండొంతులు ఆడా వున్నారు. వీళ్ళందర్నీ ఏసోబు, రాందాసులు పేరు పేరునా లెక్కించి ఎంతమందో చెప్పారు. ఇద్దరి లెక్కకూ సరిపోయింది.

అందరూ పనిలోకి మళ్ళారు. ఆడా మగా జట్టీలు జట్టీలుగా పట్టి హుషారుగా చేస్తున్నారు. మొగవాళ్ళు గడ్డ విరుస్తుంటే, ఆడవాళ్ళు తట్టల్లో కెత్తుకొని మోస్తున్నారు. ఆఖరికి రాందాసూ, ఏసోబులూ కూడా ముఠా మేస్త్రీల మనుకోకుండా, నడుంవంచి పని చేస్తున్నారు.

తను వూరికే వుండటం దేనికని వాళ్ళకు మంచి నీళ్ళందిస్తూ, హుషారుగా పని చేయమని ఆదేశిస్తున్నాడు రాజు. అంతకు ముందెప్పుడొచ్చాడో ఓంకారయ్య తెలీదు గాని "అలా చెయ్యండిలా చెయ్యండని" ఓ ప్రక్కనుంచి అందర్నీ హడావుడి పెట్టుకొంటూ వస్తున్నాడు.

రాజు దగ్గరదాకా వచ్చి ఠక్కున వెనక్కి తిరిగాడు. రాజును చూడగానే నిప్పులమీద అడుగేసి నట్లయి చర

చరా యింటోవేపు వెళ్ళిపోతూ మరింత విసురుగా కేకలు బొబ్బలు పెడుతున్నాడు.

“మీ రెంత అగచినా అంతకన్నా వేగంగా వాళ్ళు చెయ్యలేరు సుమండీ! వార్ని కంఠశోష. కాస్త తాపీగా గట్టుమీద కూర్చోండి” అన్నాడు రాజు ఆయన దగ్గరగా వెళ్ళి.

శింగారయ్యకు అరికాలిమంట నెత్తి కెక్కినట్లు య్యింది. “వీడెందు కొచ్చాడిక్కడికి!” అనుకున్నాడు. అంతకన్నా మిక్కుటంగా పైకి ఏమీ అనలేక చిందులు తొక్కి రుసబుసలతో వెళ్ళిపోయాడు. ఆ వెంటనే పిల్ల పెత్తందార్లే పుల్లిగాడొచ్చాడు. వాణ్ణెవరు లెక్క చేస్తారుగనుక? కూర్చోమన్న చోట కిక్కురు మనకుండా కూర్చున్నాడు.

పొద్దు నెత్తిమీది కొచ్చింది. ఆకలి సంగతలా వుంచి దాహంతో నోళ్ళు పిడచగట్టి పోతున్నాయి. యిలా వుంటే లాభం లేదని రాజు ఓ ఫర్లాంగు దూరంలో వున్న నూతికి వెళ్ళి కావిడివేసుకొని నీళ్ళు తేవడం మొదలెట్టాడు. ఒక్కొక్కళ్ళే రెండేసి చెంబు లెగరేస్తున్నారు. అలా ఐదారుసార్లు తిరిగేసరికి రాజుపని ఐపోయింది. కాళ్ళు జారేసి కావిడి క్రిందపెట్టి కూర్చున్నాడు. అంతలోనే చెమట గ్రక్కుతున్న ముఖంతో, బరువుపడి అణగివున్న తలతో, పమిటచెంగు నడుంతిప్పి బిగువుగా బొడ్డులోదోపి, మోకాళ్ళ పైవరకూ చీర ఎగగట్టి కుచ్చిళ్ళను తొడల మధ్యనుంచి పోనిచ్చి వెనక బిళ్ళగోచీ పెట్టి పదిహేడు,

పదేనిమిదేండ్ల వయస్సులోవున్న రాందాసు కూతురు రమణమ్మ రొప్పుతూవచ్చి మంచి నీళ్ళడిగింది.

"లేవు. ఇప్పుడే అయిపోయినై" అన్నాడు రాజు.

ఆమె పెదవి విరిచింది. కళ్ళు పరిహాసంగా త్రిప్పింది.

"అబ్బో మొగోళ్ళు మొగోళ్ళకే యిత్తారు గాని అరిచ్చచ్చినా ఆడోళ్ళ కియ్యరుగా! ఆడోళ్ళంటే అంత తీసిపోయేరు" అంది ముఖం మాడ్చి.

నిజమే! తానింతవరకూ మొగాళ్ళకే నీళ్ళందించాడు గాని, ఒక్క ఆడమ్మాయికూడ గుక్కెడు నీళ్ళు త్రాగమని యివ్వలేదు. అదే ఇప్పుడు దెప్పి పొడుస్తోంది రమణమ్మ.

రాజుకు జాలివేసింది. ముందామె ముఖంలో ఎంత పరిహాస ఛాయలు చిందులు త్రొక్కాయో అంతకు వెయ్యిరెట్లు దైన్యత్వం ముప్పిరి గొన్నది. అక్కడి రమణమ్మ తనకు బాగా తెలుసు. ఏనా ఎదుటపడినా మున్నెన్నడూ తనతో యెట్టి పరిస్థితిలోనూ మాట్లాడి ఎరుగదు అలాంటి దిప్పుడు బిడియ పడకుండా వచ్చి మంచి నీళ్ళడుగుతుందంటే, ఎంత దాహమై వుంటుందో?

లేవని చెప్పినందుకు రాజుకు చాలా అభిమానమేసింది. ఇంక ఆమె ముందు కళ్ళప్పజెప్పి నిలబడే కంటే వెళ్ళి తీసుక రావడమే వుత్తమమని చక్కున కావి డేసుకుని నూతివద్ద కొచ్చి ఓ కడవ తోడి కావిట్లో పెట్టబోతుంటే "ముందు మంచీలు పొయ్యండి తీసుకెల్తుగాని" అంటూ రమణమ్మ ముందు కొచ్చింది. రాజు ఆశ్చర్యపోయాడు.

“అరే! నువ్వెప్పుడొచ్చావ్?” అన్నాడు.

“మీ యెనకాడితే వొచ్చా. దాహం పట్టాంటిది. నే తాగి మా ఆడోళ్ళకి ఎత్తికెల్తా. మీతో పెట్టుకొంటే నోరు పిడసకట్టి సావోల్సిందే” అంటూ వంగి దోసిలి పట్టింది

రాజు కిమ్మనకుండా కడవెత్తి ఒద్దని సైగ చేసే వరకూ పోసి ఆగిపోయాడు. మిగిలిన నీళ్ళు పారబోయబోతుంటే, అడక్కుండానే కడవ లాక్కొని కాళ్ళూ, చేతులూ, ముఖం కడిగి పైటచెంగు విప్పి తుడుచుకొని “ఎంత చల్లగా వుందాది?” అంది - అలాగన్నది కేవలం తానేమన్నా ప్రతి మాట్లాడతాడనే వుద్దేశంతో అనవచ్చు గానీ నోరు మెదపకుండా వెళ్ళి రాజు రెండు కడవలూ తోడుకొని కాపిట్లో పెట్టుకొన్నాడు.

“నేనో కడవ తెత్తాను మీరోటి ఎత్తికెల్లండి—” అంటూ ఓ కడవ తీసుకోబోయింది. రాజు అటకాయించి “వొద్దు. కావిడికి రెండూ లేందే కుదరదు” అన్నాడు.

ఆమె కాసేపటిదాకా కడవ వదల్లేదు. ఆఖరికెలాగో విడిచిపెట్టి “మొగోళ్ళు పట్టిన పట్టిడవరు” అంటూ వెళ్ళిపోయింది. ఇంకాసేపు నిలిపి అలాంటి మాటలనిపించుకొంటూ వినాలనిపించింది గానీ, అతిగా పోవడం అంత మంచిది కాదని వొకచెంపా, ఇప్పటికే మంచినీళ్ళకై కొట్టుకు చస్తుంటారని మరో చెంపా పీకులాటపడి దబ్బున కావిడెత్తుకొని పనిచేస్తున్న వాళ్ళవద్ద కొచ్చాడు రాజు.

గను కావిడి దించేసరికే అందరూ బెలబెలమంటూ పని వదిలి - కావిడిపై ఎగబడి ఒక్క చుక్క లేకుండా పీల్చేశారు.

"ఇయ్యాలింక శెయ్యలేము బాబు. యిప్పడికే రెండయ్యిండేను" అంటూ ఏసోబూ రాందాసూ దగ్గర కొచ్చారు.

"ఊ! నడవండి? నే ననబోయింది మీరే అనేశారు" అన్నాడు రాజు. ఆ మాటలతో అందరూ పలుగూ - పారా, తట్టా - బుట్టా సర్దుకొని ఒక్కుమ్మడిగా యింటి ముహం పట్టారు.

## 5

"బాబో, అంతా మోసం చేశాడు నాయాలు" రాజూ, రాందాసూ యింటి వసారాలో కూర్చుని మాట్లాడుకొంటూండగా ఏసోబు గొడవ చేసుకొంటూ వచ్చి పడ్డాడు.

ఇద్దరూ ఆశ్చర్యపోయారు. సంభాషణ లాపి అతని వేపు తిరిగారు.

"ఏం జరిగింది ఏసోబు?" అన్నాడు రాజు.

"ఆ నాయాలు, పద్దాలుగణాలు; ముప్పావలా కాడికే యిచ్చేడు కూలి."

"ఏమిటి?" ఇద్దరూ తెల్లమొగం వేశారు.

"నువ్వెట్టా వొప్పుకుండావురా ఏసోబు?" అన్నాడు రాందాసు.

"యాం జెయిను రాందాసు, అరిని.... ఎంత బతిమాలినా వొప్పుకోందే— సత్తే రెండూ, రెండున్నర యిమ్మంటన్నాడే! యింకేం జెయ్యను. అట్టె గొడవడితే, అదికూడా యియ్యడేమోనని అందాక వొరకే తెచ్చా—"

"అఘాయిత్యం వచ్చింది. పుల్లిగాడు కనిపించలా?" అడిగాడు రాజు మళ్ళీ. "అగపడ్డాడు" ఆ సన్నాసి నాయాలు మాట్టాడందే!" రాజుకు శివాలెత్తి పోయింది ఇంచు మించు రాందాసుకూ అలాగే వుంది. మండు టెండలో నురగలు కక్కుతూ శ్రమ చేశారు. క్షణం 'అలసట' చెందక ఎత్తిన తట్ట దించకుండా 'గడ్డ' మోశారు. రెక్కలు, పోతున్నా లెక్క చేయక పలుగుతో భూదేవిని ఛేదించి చెమటలు చిందించారు. కానీ ఫలితం?

"ఏసోబు! చాలా కక్కుర్తిపని చేశావోయ్. మీ కష్టానికి తగ్గ ప్రతిఫలం లేనప్పుడు - అది ముట్టుకు నేం జేసుకొంటారు—"

"ఇప్పుడేం చెయ్యమంటారు చెప్పండి"

"ఏది, ఆ డబ్బిటివ్వు." ఏసోబు కిమ్మనకుండా ఆ డబ్బంతా రాజు చేతి కిచ్చివేశాడు. ఇక ఆలశ్యం చెయ్యక రాందాసునూ, ఏసోబును కూడా తీసుకొని ఓంకారయ్య గారింటికి బయలుదేరారు. దారిలో మొన్న పని చేసిన కూలీ

లందరూ కలసి, ఒక్కుమ్మడిగా ఓంకారయ్యగా రింటి ఆవరణలో ప్రవేశించారు. ఈ చోద్యం చూట్టానికి వచ్చిన వాళ్ళతో సహా ఆవరణ కిటకిట లాడిపోయింది

ఈ మహా జనాంగాన్ని చూచి మేడ క్రింది వరండాలో పుల్లిగాడితో మంతనాలు జరుపుతున్న ఓంకారయ్య అదిరి బెదిరి నిశ్చేష్టుడుగా నిలబడి పోయాడు.

"ఏమిటి మీరంతా యిలా దండెత్తి వచ్చారు?". అంటూ ఎలాగో మాట పెకలించాడు ఓంకారయ్య.

"ఏమిటా? మీరు చేసిన అన్యాయాన్ని, మోసాన్ని ఖండించడాని కొచ్చాం—" అంటూ అందరికన్నా ముందు నిలబడివున్న రాజు గట్టిగా మాట్లాడాడు. ఓంకారయ్యకు కారణం అర్థమైనా కాకపోయినా రాజు గొంతు వినబడే సరికి ఆపాదమస్తకం ఆవేశంతో వూగిపోతున్నాడు—

"ఏమిటా మోసం, అన్యాయం?"

"రెండూ, రెండున్నర యిస్తామని పని చేయించు కొని, యిచ్చేసరికి ముప్పావలా, పద్నాలుగణాలా మా ముఖాన కొట్టేది? - దీన్నే మంటారు. అన్యాయ మంటారా? మోస మంటారా?"

"ఏకీ కాదంటారు. నేను మమ్మల్ని ముప్పావలా, పద్నాలుగణాల రేటునేగా పిలవమని చెప్పింది_"

"అబద్ధం. పుల్లిగా డొచ్చి ఏమన్నాడో అడగండి - రెండూ, రెండున్నర యిస్తేనే వొస్తామంటే వెంటనే - మిమ్మల్ని కనుక్కొచ్చి - అంత కిష్టపడ్డారు - వొచ్చి పని మొదల బెట్టమంటేనే మీ చేలో అడుగెట్టాం. ఏంరా

పుల్లి ?" అని కళ్లెర్ర జేసి వాడికేసి తిరిగాడు రాజు. వాడు వంగి వంగి, ఎటూ మాట్లాడకుండా ఉండిపోయాడు.

"ఓన్నె. వాడెందుకు మాట్లాడతాడు? దొరకపైతే వాడొక బాతాడా!...." అంటూండగా ఓంకారయ్య మధ్యలోనే అందుకొన్నాడు. "అక్కడే పొరబడుతున్నావ్ రాజు. నేను ముప్పావలా, పద్నాలుగణాలకు మాట్లాడి రమ్మంటే వెళ్ళి అంతకు వొప్పుకోలేదనీ, రెండూ, రెండున్నర యిస్తేనే చేస్తామన్నారనీ, తిరిగొచ్చి, నాకు చెప్పితే "అంతకే" రమ్మన్నాను. 'అంతకే' అంటే నా వుద్దేశం ఆ ముప్పావలా పద్నాలుగణాలే గానీ, మీరడిగిన రెండూ, రెండున్నరని అర్థం కాదు. వాడర్థం చేసుకోడం సరిలేక మీ కట్లా చెప్పంటాడు."

అందరూ వుడికిపోయారు. 'అంతకే' అన్నమాటలో ఎంత మోసాన్ని దాచి పెట్టాడో తెలుసుకొని వ్రూగిసలాడిపోయారు. వందలు వేలు గడించటానికి మోసకారులు ఎంతటి సులువైన పథకాలను వేయగలరో దీన్నిబట్టి తేటపడింది.

"అంతకే- అన్న మీ మాట మమ్మల్ని పూర్తిగా ముంచేసింది - గజాల్లెక్కన చేసుకొన్నా మనిషికి సరాసరికి రూపాయిన్నర తక్కువ కాకుండా పడేదే? అట్లాంటిది మీరు స్పష్టంగా చెప్పి వున్నట్లయితే ఆ ముప్పావులా పద్దాలు గణాలకు మోమోంచివచ్చే వాళ్ళమా ?"

"ఎవరికి తెలుసు! వచ్చినా రాకపోయినా అంతకు మించి యిచ్చేది లేదు."

"ఇవ్వరూ? ఒక్కసారి ఈ క్షుద్బాధిత హృదయా లను పరీక్షించండి—వాళ్ళ ఆకారాలు ఎలా గున్నాయో మీ కండ్లతో స్వయంగా చూడండి — కండలు ముడిగి శుష్కించిన శరీరాలపై జానెడు గుడ్డలేక వటవటలాడుతూ వెన్నుకంటిన పొట్టలుపట్టుకొని ఆకటికి అలమటిస్తున్న ఆ అస్థిపంజరాలను తిలకించండి - ఆ తర్వాత మిమ్మల్ని పరీక్షించుకోండి - ఇద్దరూ మానవులే-ఇద్దరిలో కనిపిస్తున్న తారతమ్యాన్ని ఒక్కసారి చెప్పండి - ఒకరలా ఒకరిలా వుండడానికి భేదాన్ని వివరించండి."

"ఆపు యింక నీ ఉపోద్ఘాతం. అదంతా మాకు బాగా తెలుసు -"

"బాగానే తెలుసు. వాళ్ళ కష్టాల్ని, శక్తిని దోచు కొని మేడలూ, మిద్దెలూ కట్టిన సంగతి బాగానే తెలుసు.. ఓంకారయ్యగారూ! మేమంత సునాయాసంగా వెళ్ళిపో డానికొచ్చాడు యిక్కడికొచ్చింది— మా కూలి మా కిచ్చే వరకూ కదిలేది లేదు—"

"కదలకపోతే అక్కడేతిష్టవేసుక్కూర్చోండి. దమ్మిడీ యిచ్చేదిలేదు—"

"సరే అంత యివ్వనని మొండికేసేవాళ్ళతో మేం పోటీపడ్డం మాదే బుద్ధితక్కువ. యిదిగో మీరిచ్చిన యీ మొత్తాన్నికూడా తీసుకోండి" అంటూ అమాంతంగా ఓంకారయ్యమీదికి, తన చేతిలోవున్న డబ్బును విసరాడు రాజు. హఠాత్తుగా మేడమీదనుంచి ఎవరో స్త్రీ రాజు

నుద్దేశించి పిలిచినట్లయింది. అతను అటు తలెత్తకముందే మెట్లు దిగి లలిత రానేవచ్చింది. రాజు విసరగా చెల్లా చెదరై పడివున్న రూపాయల కాగితాలన్నీ హడావిడిగా ఏరుతూవుంటే, తండ్రి గద్దించి, తీయబోకన్నాడు.

"ఔను నాన్నా ? వాళ్ళడిగింది యివ్వడానికేం ? వాళ్ళు కష్టపడి చేసినప్పుడు మన స్తోమతనుబట్టి రెండు కాదు మూడిచ్చినా ఫర్వాలేదు. వాళ్ళు బాగుంటేనే మన బాగని తలచాలి–" అంటూ అన్నీ ఏరి చేత్తో పట్టు కొని నిలబడింది.

"లలితా! నిన్నస లిక్కడి కెవ్వరమ్మన్నారు? వెళ్ళు లోపలికి–" అంటూ చెయ్యి పట్టుకొని విదిలించాడు – ఆమె ఆ విసురు నాపుకొనలేక అంత దూరం వెళ్ళి పడబోతుంటే తల్లి ఆ ప్రక్కన గదిలోంచి పరుగెత్తుకొచ్చి పట్టుకొంది.

"ఎవరిమీదకోపమో కూతురిమీద చూపుకుంటా రుటండి !" అంటూ మండిపడింది. రాజును చూచేసరికి అది మరీ ఎక్కువైంది.

"చాల్లే నోరుమూసి లోనికెళ్ళండి !"

"మేమూ వెళ్తున్నాం. కానీ ఒకటి గుర్తుంచుకోండి– మా కష్టం ఏనాటికైనా వడ్డీతోసహా వసూలు చేస్తాం. అణిగి మణిగివున్న మా శక్తిని బయల్పరచి ప్రపంచాన్నే తారుమారుచేస్తాం. గుర్తుంచుకోండి!" అంటూ రాజు చప్పున వెనక్కి తిరిగాడు. తమ తట్టుపలికిన లలితను కళ్ళారా ఒక్కసారి చూద్దామనుకొన్నాడు. గాని, యీ

గందరగోళంలో ఆ అవకాశం చిక్కకపోయింది. వాళ్ళందరినీ వెనక్కి మళ్ళించుకొని బెలబెలమంటూ ఆవరణదాటి వీధిని పడ్డాడు.

## 6

అన్నిటికీ కోటయ్యతాత పోకచెక్కలా నలిగిపోతున్నాడు. అందరినీ అలా తనే వుసుకొలుపుతున్నాడని ఓంకారయ్య ధూంధాంలు చేస్తున్నాడు. తన కిచ్చే జీతం కూడా కత్తిరిస్తున్నాడు. ఇదంతా ఎవరు భరించగలరు? అదేమనంటే యీ క్షణంలోనే వెళ్ళిపొమ్మంటున్నాడు. వెళ్ళగలడు. కానీ, వెళ్తే వెనక చేసిందానికి స్వస్తివాచకం చెప్పి మరీ కదలాలి. కంపమీద గుడ్డేసి చెక్కమని లాగే కంటే నెమ్మదిగా లాక్కోడమే మంచిదని, ఎన్ని అంటున్నా మాట్లాడకుండా వుంటున్నాడు.

అలా వుంటున్నా తన్నే పనీ చెయ్యనివ్వడంలేదు. పాలేరు పుల్లిగాడు పేకాడి తిరిగొస్తుంటే తనింటివద్ద నుండి గొడ్డూ—గోదా, పిల్ల్యా పాలు చూచుకొంటూంటాడు. ఆఖరికి పాచిపనీ, అంట్లుపని తనే చూచుకొనేవాడు. తను అంట్లు తోముతుండటం చూచి లలిత జాలిపడి తన్నా పని నుండి తొలగించి ఆమె పురమాయించుకొనేది. ఇప్పుడైతే యివేమీ లేకుండా గోళ్ళు గిల్లుకొంటూ వుండవలసి

వచ్చింది. తన స్థానమేమో, మరింకెవరిస్థానమేమో తెలియదు గాని అంట్లపనీ, పాచిపనీ నిర్వర్తించడానికి పుల్లిగాడి ద్వారా 'లచ్చువమ్మ' అనేదాన్ని పెట్టుకొన్నాడు ఓంకారయ్య. అందుకు తనకు సంతృప్తికరంగానే వుంది. ఏదో రూపేణా మరో కొత్తవ్యక్తి పోషింపబడటానికి తన మనస్సన్నివిధాలా వొప్పందపడిందిగానీ, పెండ్లీ పెటాకులేని వయస్సులోవున్న యీలాంటి పిల్లని యింట్లో పనికి పెట్టుకోడం తన కేంటో యిదిగానే వుంది. ఆవిడొచ్చి చేరాక ఓంకారయ్యసలు జొత్తిగా యింట్లోకే అడుగు పెట్టనీయడం లేదు.

తన యిబ్బందులన్నీ చెప్పుకొందామంటే ఎవరు వింటారు? కానీ తనకో విశ్వాసముంది. లలితమ్మ తనేది చెప్పినా సావధానంగా విని తగిన సలహాలివ్వడమేగాక సాధ్యమైనంత సహాయపడుతుంది.

కోటయ్య గొడ్లముందు నాల్గు ఎండుపరక లిదిల్చి మేడ పైభాగంలో నిలబడి దిక్కులు చూస్తున్న లలితదగ్గర కొచ్చాడు.

"ఏమిటి కోటయ్యా, గొడ్డవసారాలో తలబట్టుకొని కూర్చున్నావ్. ఒకటిరెండుసార్లు పిలచానే. వినబడలేదా!"

"కాదమ్మా" అంటూ కోటయ్య తన ముఖాన్ని ఆమె వేపుకు మరల్చాడు. ఆమె చకితురాలైంది. మున్నెన్నడూ లేని విషాద రేఖలు అతని ముఖమంతటినీ క్రమ్ముకొని వున్నాయి.

"కోటయ్యా, ఏమిటలాగున్నావ్. ఏం జరిగింది?" ఆత్రుత గొంతుతో అడిగింది.

"యేం చెప్పనమ్మా - నేనీ యింట్లో ఏపనీ చెయ్యకుండా వూరికే ఎట్టాగుండను? యేదన్నా శ్రేద్దామని శెయ్యబోతే మీ నాయనగారు వూరుకోరయ్యె" - ఎటూ పాలుపోక కోటయ్య కండ్లల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. అనుకోకుండానే రెండు కన్నీటి చుక్కలు చెక్కిళ్లమీదుగా జారిపోయాయి. అయినా లలిత విచారం వ్యక్తపర్చలేదు. పేలవంగా నవ్వింది.

"అందుకని వెళ్ళిపోనా మనుకొంటున్నావా కోటయ్యా! పిచ్చితనం! నీతో పని చేయించుకోకపోవడం మా అవివేకం! నీకిచ్చే జీతం తప్పడంలేదుగా?"

"పని చేయించుకోనప్పుడు జీతమెట్టా యిత్తారమ్మా. యిచ్చినా నాకు తృప్తి ఉండొద్దూ."

"ఉన్నా వుండకపోయినా నీజీతం నీకు రావడం ఖరారు. అంతమట్టుకు నేను చూచుకుంటాను."

కోటయ్య వెళ్ళిపోదామని వెనక్కి తిరిగాడు. లలిత పిలిచింది.

"ఏటమ్మగోరు" అంటూ కోటయ్య ఇటు తిరిగాడు.

ఆమె మాట్లాడలేదు. ఏదో మాట్లాలనుకుంటుంది గాని సంశయపడిపోతుంది. మనస్సులో వున్నది మర్మం విడిచి చెప్పడానికి సిగ్గుపడుతున్నదానిలా ఆమె పెదాలు వణుకుతున్నాయి. చెక్కిళ్ళు, ఏదో బయల్పర్చని సిగ్గూ,

బిడియం, భయంతో ఎర్రబడ్డాయి. నొసటిపై అక్కడక్కడ స్వేద బిందువులు పొటమరించాయి.

"కోటయ్యా, నాకో చిన్నపని చేసిపెట్టగలవూ?" వుగ్గ పట్టివుంచిన గొంతు నెలాగో విప్పింది.

"శేస్తాను శెప్పండమ్మా...." మళ్ళీ నోరాడలేదు. ఈ చెప్పదల్చుకొన్నదానికోరకే క్రితం చావట్లోవున్న కోటయ్యను రెండుమూడుసార్లు పిలచింది. "రాజుతో ఓసారి మాట్లాడాలనివుంది. మరి వాళ్ళింటికి తీసుకెళ్ళగలవా?" ధైర్యంగా చెప్పి అంతలోనే సిగ్గుతో కుంచుకుపోయింది. ఆమె అడిగినదానికి కోటయ్య కొంచెం నివ్వెరపాటు చెందినా మొత్తంమీద కోర్కెను తీర్చడానికే తలపడ్డాడు.

"అట్టాగేనమ్మ, బయలుదేరుండి-" లలిత క్షణంలో వెళ్ళి ముస్తాబై వచ్చింది. తానింతవరకు యిల్లు విడిచి బైట కెళ్ళి ఎరుగదు. అట్లాంటప్పుడు ఎలా బయలుదేరాలన్న సంశయపడింది. అమ్మకు చెబితే వెళ్ళనివ్వదు. నాన్నకు చెప్పాలన్నా తనతో అంతగా మాట్లాడ్డంలేదు. ఒక వేళ తను వెళ్తాంటే కలిపించుకొని అడుగుతాడేమో ననుకోడానికి యింట్లోకూడా లేడు.

లలిత కోటయ్యతో పాటు బయలుదేరింది. తీరా మేడ మెట్లు దిగి క్రిందకొచ్చేసరికి పనిగత్తె లచ్చువమ్మ ఎదురై "ఎక్కడికండీ అమ్మగోరు" అంది.

"నీకెందుకే" అని కసిరింది లలిత.

"అమ్మగోరు తానానికి రమ్మంటోంది."

"యిప్పుడొద్దని చెప్పు." ఇంక మారాడక అదిలోనికి వెళ్ళిపోయింది.

లలిత, కోటయ్యా రాజుగారింటికొచ్చారు. అప్పుడే పొద్దుకూకుతూ కూకుతూవుంది. రాజు యింటివద్దే వుండి, వంట చేసుకొంటున్నాడు. వంటిని చొక్కా అయినా లేకుండా మొలకో తుండు చుట్టుకొని ఒళ్ళంతా చెమటలు కక్కుతుండగా, వూదినా పొయ్యి మండక కళ్ళనిండా 'పొగ' కొట్టుకొంటూంటే వుక్కిరిబిక్కిరైపోతున్నాడు. వీళ్ళనుచూచి గబగబా దణ్ణెంమీదవున్న లుంగీ చుట్టుకొని, చిరుచాప పర్చి లలితను కూర్చోమన్నట్లు కనుసంజ్ఞచేసి "ఏంతాతా! వేళగాని వేళలో వచ్చారు." అంటూ కోటయ్యను పలకరించి తిరిగి పొయ్యిముందుకెళ్ళి "వూదుడు గొట్టం పట్టుకొని "వుఫ్" అని వూదటం మొదలెట్టాడు.

రాజు అలా చేతగాని పనితో సతమతమౌతుండటం లలిత చూడలేకపోయింది. స్త్రీ పుట్టి పెరగడంతోనే విధిగా అలవర్చుకొనే యిలాంటి పని తనకు బాగా తెలిసీ, చేతనైయ్యుండీ, ఆ పంచలకేపోని ఒకానొక పురుషవ్యక్తి కళ్ళు పోగొట్టుకొని అవస్థ పడుతూంటే ఆమె మనస్సు ఆగలేకపోయింది. తనకు చాతనైనపని చెయ్యడమే తన కర్తవ్యం.

"ఐనా యిప్పుడేం మునుచుకుపోయిందిలేదులే! మీరు తొలగండి" అంటూ ఎంతో స్వతంత్రమున్న దాని లాగే వెళ్ళి అతని చేతిలోని గొట్టం తీసుకొని అతను

ప్రక్కకు తొలక్కుండా వొంగి వూదింది. బగ్గున పొయ్యి మండ నారంభించింది. యింక ఆవిడ బలవంతానైనా అక్కడే తిష్ట వేసేట్టున్నదని మెల్లిగా లేచి ఓ ప్రక్కకు సర్దుకొన్నాడు రాజు.

"చాలా అవస్థపడుతున్నారు అంది లలిత. రాజు ఆమె అన్నది విననట్లు "పనిమీదొచ్చారేమిటి తాతా?" అని అడిగాడు.

"అమ్మాయిగోరు నీతో మాట్టాడాలని నన్నెంట పెట్టుకొచ్చింది. మాటాడుకోండి! నేనట్టా ఎలపలుంటాను" అని రాజు పిలుస్తూన్నా నిలవకుండా వెలుపలకు వెళ్ళాడు కోటయ్యతాత.

రాజు కేటూ పాలుపోక, ఆమె నేమని పలుకరించేదీ తెలీక అక్కడక్కడే కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడు.

"మీరు చాలా తప్పుపని చేస్తున్నారు రాజూ! ఓ వంటమనిషిని పెట్టుకోకూడదూ!" అంది లలిత కలిపించుకొని.

"అంతవరకూ తాహతులేకనే_" అని రాజు అనేసరికి, నోటికి తాళంపడింది. అంతలోనే మళ్ళీ అందుకొంది.

"అదెలా నమ్మడం! తాహతులేనివాళ్ళు అలా డబ్బును ముఖానకొట్టి వచ్చేస్తారా?

"ఫర్వాలేదు. మాకు రెక్కలే ఆధారంగనక, ఒకటి రెండు రోజుల కష్టం పోయిందనుకొంటాం."

"అదే వెర్రితనమంటాను. ఇచ్చింది తీసుకొని రావలసినదాన్ని గూర్చి ప్రయత్నించాలిగానీ, ఆవేశపడి

అలా వద్దని విసిరివేస్తే నష్టపడేదె వరు? ఆకొచ్చి ముల్లుపై బడినా, ముల్లొచ్చి ఆకుపైబడినా నష్టం దేనికో గుర్తించాలి. అంటూ ఆమె హితబోధ చేస్తున్నట్లు మాట్లాడుతూంది. రాజు నోరు మెదపక పెద ముఖం పెట్టి వింటూ వున్నాడు.

"ఇదిగో తీసుకోండి – మీరడిగిన మేరకు నేను పూర్తి చేసి తెచ్చాను." అంటూ అతని దగ్గరగా వెళ్ళి చేతిలో వున్న పర్సులోంచి డబ్బు తీసి అందించబోతే, అతనికి తీసుకో మనస్కరించక వద్దన్నాడు. ఆమె బలవంతాన అతని చేతిని పట్టుకొని ఆ డబ్బు అతను తీసుకొనే వరకూ చెయ్యి వదిలిపెట్టలేదు. అతను ఆ డబ్బు చేతిలో పెట్టుకుని ఆమెతో ఏమో అనబోతుండగా "వంటయ్యిందా రాజు – యీరాం కూర" అంటూ రాందాసు కూతురు రమణమ్మ లోనికొచ్చింది. వీళ్ళిద్దరినీ ఏకాంతంగా వుంటం చూచి లజ్జపడి కోపంతో తెచ్చిన కూరను అక్కడే పెట్టేసి "అందులో కూరుంది తీసుకో" అంటూ గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది. అలంకరణలు లేకపోయినా సామాన్య దుస్తుల్లో తళుక్కున మెరసిన ఆమె అందానికి అసూయపడి "ఎంత బాగుంది" అనుకొంది లలిత.

"ఎవరు రాజు ఆ అమ్మాయి?" అన్నది.

"మా పక్కింటి రాందాసుగారి అమ్మాయి—"

"ఓహో !"

ఆ తర్వాత చాలా సేపటి దాకా యిద్దరూ మౌనంగా వుండిపోయారు. లలిత వెళ్ళి పొయ్యిమీద వుడికి వున్న అన్నం దించి "రాజూ! పేదల కొరకు పని చెయ్యాలని నాకు మక్కువగా వుంది. నన్నుకూడా మీలో కలుపుకో గలరా?" అంది.

"తప్పకుండా. మీలాంటి వారి సలహా సహకారాలను మేమెప్పుడూ పొందుతాము."

"నాకూ కావలసిం దదే - ఈ విషయం మిమ్మల్ని స్వయంగా కనుక్కుందామనే వచ్చింది. ఇంక సెలవా?" అన్నదే గాని వెళ్ళడానికి తటపటాయించింది. ఇంకేదో చెప్పకూడని రహస్యాన్ని చెప్పడానికి పులకించింది గాని, అంతలోనే ఏమీ లేనట్లు శిరఃకంపన చేస్తూ బయలుదేర బోతుండగా, కోటయ్య తాత లోనికివచ్చి 'వాకిట్లో పుల్లి గోడు నీ కోసం ఎదురు సూత్తూండమ్మ' అణ్ణి అయ్యగోరు నీ కోసం పంపించేడంట" అన్నాడు. "సరె పద. కోటయ్యను ముందు నడిపిస్తూ, వెళ్తున్నట్లు ఆ చూపుల తోనే రాజువద్ద అనుమతిని పొంది మందగమనంతో వెలుపలకు నడిచింది.

## 7

ఆ యిచ్చిన డబ్బు పంచేయాలని రాందాసుకూ, ఏ సోబుకూ కబురు చేశాడు రాజు. రాందాసు వచ్చాడు

గాని యేసోబు యింకా రాలేదు. అసలు వాడు పల్లెలో లేడని కబురొచ్చింది. ఆ డబ్బు విషయమై రాందాసుతో ప్రస్తావించేసరికి విస్తుబోయి "అంత తేగం చేసిందా?" అన్నాడు.

"చేసింది. లేని వాళ్ళపట్ల ఆమెకు వుదారబుద్ధి మెండు – ఉన్నవాళ్ళలో అలాంటి వుదారులు అరుదుగా వుంటారు."

"కామోసు!"

ఇంతలో యేసోబు ఐదారుగురు హరిజనులతో వచ్చాడు——

"కబురందిందీ యేసోబు"

"లేదు పంచాయి ఆఫీసు దగ్గిర కెల్తొత్తుండాం."

"దేనికి?"

"పెశిడెంటుగోరు మనూర్నుంచి రాంపల్లి వరకూ మట్టి రోడ్డెయ్యాలని కబురు శేత్తే ఎల్లి సూసొత్తుండా. రోడ్డు రెండునర్ర మైల్లుదాకా పొయ్యాల్సుంటుంది. బాగా గిట్టే దట్టే వుండింది. గాని, ఓంకారయ్య కంటరాక్టు తీసుకోనేటుండాడు. ఆయనగారి కడ మనం పని చెయ్యాలంటే హల్లికిహల్లి సున్నకు సున్న ……"

"సరే. ఇప్పుడే ప్రెసిడెంటుగారితో మాట్లాడుదాం. ఆయన ఎక్కడున్నాడు?"

"అందరూ పంచాయతీ ఆఫీసు దగ్గర ఉండాలి"

బయలుదేరి పంచాయతీ ఆఫీసు దగ్గర కొచ్చారు. అక్కడ పంచాయతీ సమితివాళ్ళ జీపులో ప్రెసిడెంటు పరం

ధామయ్య ఓంకారయ్య వెనుక సీటులో కూర్చొన్నారు. ముందు పంచాయతీ సమితి అధికారి బి. డి. ఓ. కూర్చొన్నారు.

రాజు బీ డీ. వోగారి ఎదుట కెళ్ళి రెండు చేతులూ మోడ్చి నమస్కరించాడు. ఆయన ప్రతి నమస్కరించి రాజు వేపు ప్రశ్నార్థకంగా దృష్టి సారించాడు.

"సాబు తమ రథకార్లు. మాబోటి పేదోళ్ళకు పనేమన్నా వుంటే సూపిద్దురూ. చచ్చిపోతున్నాం తిండికి" అన్నాడు.

"ఇందాక నే అతనికి చెప్పారు ప్రెసిడెంటుగారు, ఈ వూరినుంచి రాంపల్లికి రోడ్డు వెయ్యాలి. ఏం! చెప్ప లేదటయ్యా" అంటూ ఏసోబు వేపు చూశాడు అధికారి.

"చెప్పబట్టే వచ్చామండి - అదెలా చెయ్యాలో ఏమిటో మా కాస్త వివరంగా చెప్పండి"

"ఇంకా వివరమేముంది రాజూ! దాన్ని ఓంకా రయ్య గారికి ఏడువేల మూడొందలకి కంట్రాక్టిచ్చాం - ఆయనన్నడిగి రేపే పనిలో దిగండి."

ఆయన కంట్రాక్టుక్రింద మేం చెయ్యాలంటే కష్ట మండి - ఆయన అణా, బేడా యిస్తానంటే తలవగ్గ వలసిందేనా?"

"తప్పగు" అన్నాడు ఓంకారయ్య. దాన్ని ప్రెసి డెంటు పరంధామయ్య కూడా బలపర్చాడు. గత్యంతరం లేక అధికారికి మొరబెట్టుకొన్నారు వీళ్ళందరూ.

"మీరు చేసుకోవాలనుకొంటే మరో పద్ధతి కూడా వుంది. ఇప్పు డప్పుడే ఓంకారయ్యగారి కింద కాంట్రాక్టు యివ్వలేదు. ఓ ఐదొందలు రూపాయలు షేరధనం క్రింద కట్టి లేబరు సంఘం యేర్పాటు చేసుకోండి. వెంటనే ఆ రోడ్డు మీకు ఆర్డరు వేస్తా" అన్నాడు బి. డి వో వాళ్ళ పరిస్థితికి జాలిపడి—

వెంటనే రాజు తన జేబులోంచి ఐదొందలు తీసి అధికారి చేతి కిచ్చాడు.

"సరే. మీకో ఎస్టిమేటు కాపీ పంపిస్తా, మీరిలా ముందుకు రావాలే గాని, అన్నిపన్లూ మీకే అప్పగిస్తాను."

"ఎన్ని పను లిచ్చినా యీ పని మట్టుకు ఓంకారయ్య గారికే యివ్వాలండి. అతను అంతో ఇంతో తంటాలు పడుతున్నాడు" అని అడిగాడు పరంధామయ్య.

"నో. నో. ఇలాంటి పనులన్నీ లేబరు సంఘాల ద్వారానే చేయించమని కలెక్టరుగారి హుకుం. అలాంటి సంఘాలు లేనిచోట బయట వాళ్ళ కెలాగూ యివ్వక తప్పదు."

చప్పున ఓంకారయ్య జీపుదిగి, చెప్పా పెట్టకుండానే యింటిదారి పట్టాడు. ఆ వెనుక పరంధామయ్య కూడా దిగి. ప్రెసిడెంటవటం వల్ల తప్పనిసరై అధికారివద్ద సెలవు తీసుకొని క్షణంలో మాయమయ్యాడు.

"పేదలు బ్రతకడం కొందరికి గిట్టదోయ్" అని అధికారి రాజుతో అంటూండగా జీపు కదిలిపోయింది ఆ

మహానుభావుని నోటా నా స్తుతించడం చేతగాక పోయినా, లోలోన సహస్రాధిక నమస్కారాలతో స్తోత్రించి వెనక్కి మళ్ళారు.

"ఆ డబ్బేడది రాజుబాబు?" అని అడిగాడు ఏసోబు అమాయకంగా.

"మీదే - మనం తిప్పికొట్టిన డబ్బు తిరిగి వడ్డీతో సహా వచ్చేసింది." ఏసోబు ఆశ్చర్యపడినా, వివరాలకోసం పోలేదు. అలాగే దారివెంట నడుస్తూ ఎటువాళ్ళటు చీలిపోయారు. రాజుకూడా యింటికి చేరుకున్నాడు, అతని తల చిట చిట లాడుతోంది. కణతలు అదిరిపోతున్నై. కొద్దిగా ఒళ్ళు వెచ్చగా కూడా వుంది, ఇంకా అన్నం వండుకొనే ఓపికా లేదు. మంచం వాల్చుకొని పండుకొన్నాడు - కడుపులో ఆకలిమంట మట్టుకు పైకి తన్నుతోంది. ఈ క్షణంలో ఎవరైనా కాసిని పొంగు నీళ్ళు కాచిస్తే హాయిగా తాగుదును గదా అని ఆలోచించ సాగాడు - అంత మాత్రమే వుంటే యికనేం అనుకొని నిస్తబ్దుగా ముసుగు తన్ని పండుకొన్నాడు. చప్పున తన ముసుగెవరో లాగి వేసినట్లయి కళ్ళు విప్పిచూశాడు తన మంచం పట్టి కానుకొని రమణమ్మ నిలబడి వుంది.

"పదిగంట్ల పొద్దయినా ఎక్కలా. అప్పుడే యేం ముసుగు రాజూ!" అని అడిగింది.

"వంట్లో బాగాలేదు. నీకు పున్నె ముంటుంది కాసేపు పండుకోనీ!"

"అంత బాగు లేక పోవటానికి యేంటో జబ్బు?"

"వేరే యేం లేదు. తల నొప్పిగా వుంది. పగిలి పోతోంది తల కాస్త అమృతాంజనం రాస్తావు తెచ్చి, ఆ సొరుగులో వుంది."

"ఆ!" రమణమ్మ సొరుగులో వున్న అమృతాంజనం డబ్బా తెచ్చి కొద్దిగా వ్రేలికి రాసుకొని బిడియపడకుండా వొంగి అతని నొసలిపైనా, కణతలపైనా అంటించి చెమటలు పట్టేలా మర్దన చేసింది—

"ఇంత యిదిగా వుంటప్పుడు మొన్నొచ్చి నమ్మాయికి కబురు చేయక పోయేరు!" అంది చిలిపిగా కళ్ళార్పి—

రాజుకు చటుక్కున కాలింది గాని, యేమన్నా అంటే ఆ చేసే పరిచర్య దక్కకుండా పోతుందే మోనని మెదలకున్నాడు.

"ఆవిడేదో పనుంటే వచ్చిందిగాని, నీలాగా సేవ చెయ్యడానికి రాలా ?"

"వొట్టి అబద్ధం. నాకు తెలుత్తానే వుండాదిలే. ఆ అమ్మాయికీ, నీకూ మనసు కుదిరిందంటగా! పెళ్ళి చేసుకొంటారా?" ముసిముసిగా నవ్వి అమృతాంజనం డబ్బా యథాస్థానే వుంచొచ్చింది.

"ఛీ!" రాజు ఆమె ముఖం చూడలేక కళ్ళు రెండు చేతులా మూసుకొన్నాడు.

"రమణీ! నువ్విట్లాగంటే ఇంట్లోకి రావద్దు! నేనెవర్నీ పెండ్లి చేసుకోవా లన్న ఆలోచనే లేదింత వరకూ...."

"ఇప్పుడు చెప్పేనుగా,"

అల్లాంటివే చెప్పవొద్దని బతిమాలుతున్నా—"

"పోన్లే, అంత కోపంగా వుంటే ఆ మాటెత్తను.... ఇంతకూ వంటపని అయిందా!" అంది సంభాషణలు మార్చి.

"ఇంకా లేదు - చేసుకోవాలన్నా యిప్పట్లో ఓపిక లేదు."

"ఆ మాట నే నుండబట్టగా అన్నది" అంటూ చప్పన బియ్యం డేక్సాలో పోసుకొని కడగబోయింది—

"రమణీ! నువ్వెంత చేశావో - అంత చెప్తూనే వుంటావు - అన్నం వొద్దుగానీ, కాసిన్ని పొంగు నీళ్ళు పొంగించి యివ్వు—"

చప్పన కాసిన్ని బియ్యంతో రెండు మూడు గ్లాసుల పొంగునీళ్ళు కాచి రాజు చేతి కిచ్చింది--

ఆ పుడుకూ మడుకూ ఆరకుండానే రెండు గ్లాసు లెగ రేసి త్రేన్చాడు--

"ఇప్పుడు చాలా హాయిగా వుంది."

"వుండొచ్చు. అదంతా 'ఆకలి' తల నొప్పని నా కెప్పుడో తెలుసు" రమణమ్మ తన గల నొప్పిని యింత సులువుగా తీసి పారేసినందుకు రాజుకు నవ్వొచ్చింది - పైకి నవ్వలేదు గాని నవ్వు మొఖం పెట్టి రమణమ్మ కేసి రెప్పవాల్చకుండా చూస్తూ,

"తెలిసీ సమయానికిలా వచ్చి సాయపడుతున్నావ్ రమణీ! నీ సహాయము మరువలేను. ఏ బహుమ తివ్వాలో కోరుకో గలవా ?"

"ఇప్పుడిప్పుడే కోరుకోన్లే - కోరుకొన్నప్పుడు తప్ప కుండా యిస్తావు కదూ!"

"తప్పకుండా" తక్షణ రమణమ్మ రాజు బుగ్గపై పొడిచి లేడిపిల్లలా చెంగు చెంగున బైటికెళ్ళిపోయింది - ఆమె అలా బుగ్గమీద ఎందుకు పొడిచిందో, నృత్య భంగిమలో చలాకీగా ఎగురుతూ పోయిన ఆ నడకలోని అంతరార్థ మేమిటో తెలియక చాలాసేపు తికమక పడి పోయాడు రాజు.

## 8

ఓంకారయ్య హాల్లో పిచ్చెత్తినట్లు పచార్లు చేస్తుంటే చంద్రమతి వచ్చి ఆపు చేసింది.

"ఏమిటండీ ఆ తిరుగుడు - విసుగూ, విరామం లేకుండా; ఏ మొచ్చిపడిం దేమిటి?" అంది.

"ఏం లేదు; వున్నా నువ్వార్చే దానివా - తీర్చే దానివా!"

"నేను ఏదీ చెయ్యక పోయినా, భార్యను గనక అడిగి తెలుసుకోడం సంభావితం కదండీ?" అప్పుడే కరణం కరోగ శాస్త్రి, మునసబు ముకుందరావు సకిలించుకొంటూ హాల్లో ప్రవేశించారు. వాళ్ళను చూచి చంద్రమతి లోనికి

వెళ్ళిపోయింది. ఓంకారయ్య కోటయ్యను పిలిచి రెండు కుర్చీలు తెప్పించి యిద్దరికీ వేయించాడు.

"కూర్చోండి" అంటూ వాళ్ళిద్దరినీ కుర్చీలపై ఆసీనులను చేశాడు.

తానుకూడా ఓ కుర్చీలో కూర్చొని కాఫీకోసం లోనికి కోటయ్యతో కబురు చేశాడు.

"ఏంటో రాకరాక వచ్చారు. ఊరక రారు మహానుభావులు" అన్నాడు.

"ఊరకనే ఎలాగొస్తామండి? మీరింకా నూటఏభై రూపాయలు శిస్తు బాకీ వున్నారు. అవి కట్టేస్తే మీ వద్దకొచ్చే పనే వుండదు-" అన్నాడు మునసబు.

"అదెంతపని లెండి - రేపో మాపో వసూలు పెడతాను - ఇంతవరకు నాకు చెప్పలేదుగా మీరు మరి?"

"చెప్పాలటండీ, ఏటా కట్టేవాళ్ళకు తెలిసే వుంటుందిగా" అన్నాడు కరణం కఠోరశాస్త్రి అందుకుని -

"ఎలా తెలుస్తుందండీ - ఇయ్యేడు ఎకరాకి పది కడితే, వచ్చేఏడు పదిహేనంటారు. మీ సొమ్మేం పోయింది. నలిగి చచ్చేది మేము."

"అదీ నిజమేలెండి, తెలియ జెయ్యటం కూడా మా విధే" అన్నాడు మునసబు ముకుందరా వందుకొని.

"సర్లెండి, ఏదో అన్నాను గాని మనలో మనకేమిటి. రేపిచ్చేస్తాను లెండి" అంటూండగా లచ్చువమ్మ ట్రేలో మూడు కాఫీలు తెచ్చి ముగ్గురికీ అందించింది

"ఇప్పు డెందుకండీ ఈ కాఫీ, ఇవి త్రాగలేక చచ్చి పోతున్నాం. ఏమిటో అనుకొంటాం గాని, దీనిబదులు మజ్జిగ త్రాగినంత ఉత్తమం మరోటి లేదు–" అంటూనే యిద్దరూ త్రాగటం మొదలెట్టారు.

కావలిస్తే అవీ తెప్పిస్తా, ముందు కాఫీ సేవించండి" అన్నాడు ఓంకారయ్య గ్లాసు ఖాళీ చేసి లచ్చువమ్మ కందిస్తూ.

"అబ్బే వొద్దులెండీ, ఇవి చాలు" అన్నాడు ముకుంద రావు. కాని కఠోరశాస్త్రి యీ లోకంలోనే వున్నట్టు లేడు, అతని దృష్టంతా లచ్చువమ్మ మీదనే నిల్చి, అది చూడకపోయినా తదేకంగా దానివేపే చూస్తున్నాడు.

"ఏమే లచ్చి యిక్క డెప్పట్నుంచుంటున్నావ్" అన్నాడు హఠాత్తుగా – వులిక్కిపడి ఇటు తిరిగింది.

"ఓ పది రోజుల్నుంచుండి శాత్రిగోరు–"

"ఉంటావా; వూడతావా ?"

"పోయ్యో" అంటూ గ్లాసు అందుకొవనిగిరుక్కున తిరిగి లోనికి వెళ్ళిపోతుంటే ఆ చలాకీ చూసి "హవ్వా" అనుకొన్నాడు కఠోరశాస్త్రి.

"ఏమిటి కరణంగారు; తమరీ లోకంలో వున్నట్లు లేరు. అది నీకేమైనా తెలుసా?" అన్నాడు ఓంకారయ్య,

"తెలీకేమండి. దానమ్మ మా ఇంట్లో పనిచేసేది. అప్పుడప్పుడు యిదీ వచ్చి చేసేది."

"అలాగా! ఇంకేం బాగా ఎరిగే వుందురు."

"మీరున్నారని జడిసింది గానీ, లేకుంటే అదే నన్ను పలుకరించేదండి!"

"పాపం సిగ్గు పడుం జేను."

"కామాల్ను-"

ఆపైన చాలసేపు పరిసర వాతావరణం చీమ చిటుక్కుమంటే వినబడేంతటి నిశ్శబ్దంగా తయారయింది.

"కరణంగారూ, మీ రిద్దరూ నాకో సహాయం చేసి పెట్టండి. కొంతమంది కొక్కిరాయి వెధవలు నా కన్ని విధాలా అడ్డం వస్తున్నారు" అన్నాడు నిశ్శబ్దాన్ని భంగ పరుస్తూ ఓంకారయ్య.

"ఎవరండి వాళ్ళు-" ఇద్దరూ వుత్కంఠంతో అడిగారు.

"ఆ రాజుగా డున్నాడు చూశారూ? వాడూ, ఏసోబూ, దాసుగాళ్ళు."

ఓహ్! వాళ్ళు - మీ కెందుకు డ్డు వస్తున్నట్లు."

"ప్రతి చిన్న విషయానికీ అడ్డంవచ్చి పడుతున్నా రండి" కూలీ రేట్లు నిర్ణయం చెయ్యాలంట - అలా చేస్తేనే మా పనుల్లోకి వస్తారట.

"రాకపోతే పోనీ, మీకు పనిచేసేవాళ్ళు తక్కువా?"

"కాదనుకో - 'కో' అంటే కోటివేల మంది - అదీ గాక మొన్న రాంపల్లి వరకూ మట్టిరోడ్డు వెయ్యాలని ఆర్డ రొస్తే అది కాస్తా వాళ్ళు అడ్డుపడేసరికి నాళ్ళపరమయ్యింది- లేకుంటే నాకే కంట్రాక్టు కిచ్చేవాళ్ళు."

"సరే, ఇంతకూ నేను చేయవలసిన సహాయ మేమిటి?"

"మీకు తెలీందేమీ వుండదు. వాళ్ళ నేకో రూపేణా యిరకాటంలో పెట్టాలి. నానా యిబ్బందులు పెట్టి చెట్టు కొకళ్ళు, పుట్ట కొకళ్ళు తిరిగేట్లు చెయ్యాలి"

"సరే - మా శాయశక్తులా పని చేస్తాం" అంటూ యిద్దరూ లేచారు - కరణం బయలుదేర బోతూ కొంచెం తటపటాయించాడు. అతనలా ఎందుకు తటపటాయిస్తు న్నాడో ఓంకారయ్య కనిపెట్టేడు. లచ్చువమ్మ తలుపు చాటునుండి వారికేసి నిక్కి చూస్తూవుంది.

"సరే! ఇంకాసేపు కూర్చోండి కరణంగారూ. ఇప్పుడేమాంత మునిచుకు పోయింది యింటివద్ద" అన్నాడు ఓంకారయ్య.

"మీ రలాగే అంటారు - గ్నాన్ తెమ్ పనుంది" అంటూ ముకుందరావు బలవంతాన కఠోరశాస్త్రిని లాక్కు పోయాడు.

♦ ♦ ♦

వీరుపల్లి - రాంపల్లి మధ్య రెండున్నర మైళ్ళ రోడ్డు నిర్మాణం జోరుగా సాగిపోతోంది. ఎవరికి వారు పోటీపడి పని చేసుకుపోతున్నారు. రాందాసు గడ్డ విరచి తట్టల్లోకి ఎత్తుతూవుంటే రమణమ్మ అమాంతం నెత్తికెత్తుకొని దూకులు దూకుతూ మోసుకొని వెళ్తుంది అలాగే అందరూ ఏదో ఒక పాటతో, ఆటతో పరిహాసాలాడుతూ చైతన్య

వంతంగా పని చేసుకు పోతున్నారు. వీళ్ళందరిపైనా రాజు అజమాయిషీ చేస్తూ వాళ్ళు చేస్తున్న పని విలువ ఎప్పటి కప్పుడు లెక్క తీసుకుంటున్నాడు.

రమణీ! పడిపోతావ్. జాగ్రత్తగా మొయ్" అన్నాడు రాజు. కన్నూ మిన్నూ కానకుండా తనపక్కన రెవట్లాడుతూ నడిచిపోతున్న రమణమ్మను చూచి.

"పడేవోళ్ళని పట్టుకోంటాకే నిన్ను పైకాడెట్టింది" అని కుదుపుకుంటూ కులుక్కుంటూ వెళ్ళిపోయింది.

"ఓరి దీని ......" అనుకొంటూండ గానే ఎగ రొప్పుతూ కోటయ్య తాత పరుగెత్తుకుంటూ వచ్చాడు.

కాబో - కరణం మునసబులు యింటింటికీ ఎల్లి మీ గొడ్డను ఎట్టోళ్ళతో దొడ్డో తోలించేరు-"

"అంతపనే! ... ఆ గొడ్లెవరివో గుర్తు పట్టావా!"

"ఆఁ. అన్నీ మియ్యే. రాందాసు ఆవుదూడ కూడా అందులో వుంది "

చప్పున రాందాసు పలుగు భుజాన పెట్టి ఒక్క అడుగులో అక్కడి కొచ్చాడు.

"రాందాసు—— మన గొడ్డన్నీ తోలించి కెళ్ళి బందుల్దొడ్లో పెట్టించారట మునసబు, కరణాలు."

"ఎందుకో!" అందరూ పలుగులు, పారలూ చేతుల్తో పట్టుకొని నరికేద్దా మన్నంత రోషంతో వానర సైన్యంలా బందిలిదొడ్డి ముందుకొచ్చి పడ్డారు. దొడ్డినిండా గొడ్లు త్రొక్కిస లాడుతున్నాయి. దొడ్డికి లావుపాటి తాళం వేసి

వుంది. దాని కిరు వెంటలా సిపాయిల్లా పొడుగాటి కర్రలు బట్టుకొని యిద్దరు వెట్టివాళ్ళు కాపలా కాస్తున్నారు.

"ఎవర్రా వాటిని దొడ్లో పెట్టింది" గద్దరించి అడిగాడు రాజు.

"మేమే —"

"ఎందుకు —?"

"ఆ సంగతి కరణం మునసబుగార్ని అడుగూండి—"

వెంటనే రాజు కరణం మునసబుల కొరకు ఫ్యోనును పంప నుద్యుక్తు డవుతుండగా వాళ్ళిద్దరే అక్కడి కొచ్చారు

"ఏం కఠోరశాస్త్రిగారు - ఎందుకు నోరులేని జీవాలను తెచ్చి యిక్కడ బంధించింది?" అని అడిగాడు.

ఆ గొడ్లు కలవాళ్ళందరూ మాకు శిస్తు చెల్లించాలి. అంచేత జప్తుచేసి వాటిని తోలుకొచ్చాం."

"ఆ పని ఎవరూ లేకుండా చేశారేం. మాకు చెప్ప కుండా ఆ పని చెయ్యవచ్చా."

"చెప్పడానికి మీా రెవ్వరూ యింటివద్ద లేరు. మీా రెక్కడో వున్నారంటే అంతవరకూ వచ్చి చెప్ప వలసిన అవసరం మాకు లేదు."

"చెప్పకుండా గొడ్లను జప్తు చేసే అధికారం మీాకుందా?"

"శిస్తు చెల్లించ నప్పుడు తప్పకుండా జప్తు చేసే అధికారం మాకుంది. ఇప్పటికీ కట్టకపోతే వాటన్నిటిని వేలం వేయించి మరీ కట్టుకొంటాం."

"హా. ఐతే యింత కష్టాలని వాళ్ళకు చెప్పవద్దా? కనీసం జప్తు నోటీసన్నా వాళ్ళ కందించ వద్దా?"

"వాళ్ళ తలుపుల కంటించాం. వెళ్ళి చూచుకో మనండి—"

"వాళ్ళకు చదువురాదు. ఆ విషయం స్వయంగా చెప్పవలసిన బాధ్యత మీ మీదవుంది.—"

"బాధ్యత లేమిటో మాకు తెలుసు. మీ కనవసరం_"

"ఐతే మా బాధ్యత లేమిటో మేమూ నిర్వర్తిస్తాం... చూస్తారేం ఏసోబు! మీ శక్తి సామర్థ్యా లుపయోగించి మీ గొడ్లను మీరు వెలికి తోలుకొచ్చుకోండి." అనడమే తరువాయిగా రాందాసూ, ఏసోబులు - తమ పరివారంతో సహా ఒక్కసారిగా దొడ్డి గేటుపై విరుచుకుపడి తాళంతో సహా గేటును విరగలాగి లోనికి చొరబడ్డారు. అందులోని పశువు లన్నిటినీ గుబగుబ మంటూ బైటికి తోలారు - ఈ ధాటికి తట్టుకోలేక గేటువద్ద వున్న వెట్టివాళ్ళు కాళ్ళకు బుద్ధి చెప్పారు. మునసబు కరణాలు బిత్తరబోయి - ఇంకా అక్కడే వుంటే తమ భరతం పట్టడం ఖరారని చెరివాక వేపుకు వుడాయించారు.

"ఒరేయ్ ఏసోబు! పిరికి పందలు పారిపోతున్నారు. ఇప్పుడు వాళ్ళ బాధ్యతలూ, అధికారాలూ యేమ య్యాయో! జప్తులట - వీళ్ళముఖం త్వరగా తోలుకు పొండి -" అంటూ ఆవేశంతో వురకలు వేశారు. ఏసోబూ, రాందాసూ. తదనుయాయు లందరూ వీరావేశంతో పశువుల్ని మళ్ళేసుకొని వెళ్ళేరు.

## 9

రోడ్డు పుణ్యమా అంటూ పదిహేను రోజులు తిండికి కొరత లేకుండా బ్రతికారు. మరో పదిహేను రోజులు తాళితే ఎలాగూ వూడ్పు లొచ్చేస్తాయి. అంతవరకూ ఇలాగే ఏదో పని చేసుకుంటూ జీవనోపాధి జరుపుకో గలిగినా, వూడ్పుల ఎద్దడిలో తమ పని ఎలాగుంటుందో నన్న భవిష్యదాలోచనలో మునిగిపోయాడు రాజు.

నారుతీతకు 'మగతా' వెళ్ళినా మొగవాడికి మూడు రూపాయలు టకాయించి పలుకుతాయి. ఊడుపులప్పుడు కూడా గిరాకీ తగిలితే కూలి బాగా పలుకుతుంది. పైగా బతిమాలి తీసుకొని వెళతారు. ఈ రేట్లు ఊడ్పులన్నాళ్ళే వుంటాయి. ఆపైన మళ్ళీ "రెడ్డొచ్చె మొదలాడమ"న్నట్లు ముప్పావలాకుకూడా టికాణా ఉండదు. క్షణికమైన ఆ కూలిరేట్ల పెరుగుదలనుగూర్చి ఆలోచించడంలేదు రాజు. తాము కోరే కూలి నియమబద్ధమై శాశ్వతంగా నిలిచిపోవా లని అతని వూహ. అగనీ యిదనీ అనేక చట్టాలు తెస్తారు గాని, పొట్టకొరకు నిత్యం పాటుపడే కార్మికునికి న్యాయ మైన కూలి నిర్ణయిస్తూ సరైన చట్టం తేరెందుకనో! అలాంటిదేమైనా వుంటే అంతకూలిస్తావా, యింతకూ లిస్తావా అని ఒకళ్ళని దేబిరించవలసినపని ఉండదుగదా! స్టేషన్‌లో ప్లాట్‌ఫారం కూలీని చూడండి. మనిషి మోయు గల మణుగు బరువుకి పాతిక నయా పైసలని" రేటు నిర్ణ

యమై వుంటుంది. అలా వ్యవసాయంలో పనిచేసే కార్మికు లందరికీ ఎందుకు ఏర్పాటుచేయరు ?

రాజు ఈవిషయమై ఓసారి లలితతో ఆలోచించటం మంచిదనుకొన్నాడు. ఆమెతో మాట్లాడాలంటే వారింటికి వెళ్ళాలి. అది ఓంకారయ్య పసిగడితే, అగ్గిమీద ఆజ్యం పోసినట్లవుతుంది. అంతమాత్రానే జడిసి ఆగిపోతే ఆమెతో మాట్లాడ్డమంటూ పడదు.

రాజు ఏది ఏమైనా వెళ్ళడానికే నిశ్చయించు కొన్నాడు. అలా వీధిలోకి వచ్చేసరికి రమణమ్మ తన యింటివేపు వస్తూ ఎదురయింది.

"ఎందాక రాజూ వెల్తున్నావ్"

"అలా వెళ్తున్నాలే"

"అలా అంటే ఏడకో"

"చెప్పను."

"చెప్పాలి చెప్పందే పోనీను" అంటూ హాశం చేసింది.

వీధిలో పదిమందీ వచ్చేపోయేచోట ఇలా నిలవే యించుకోవడం ఏమిటని అతనికి అభిమానంవేసి కసిరినా, యీ సమయంలో అంత సులువుగా దారి యిస్తుందన్న నమ్మకంలేదు. ఇంక చెప్పడం తప్పదనుకొన్నాడు.

"ఓంకారయ్యగా రమ్మాయితో మాట్లాడవలసిన పనుండి."

"శిత్తం వొంటయ్యిందామరి?"

"ఇంకా లేదు. వచ్చాక చేసుకొంటాను- ఆలస్యమైతే కాస్త చేసిపెట్టు."

"ఆలిసిమే-? ఔన్లే. ఆలిసిమే అవుద్ది. అమ్మగుతో మాట్టాట్టంకదూ మరి?" రమణమ్మ యీ ఎత్తిపొడుపు మాటకు సుర్రుమన్నదిగాని తమాయించుకొన్నాడు.

"నువ్వనుకునే "ఆలస్యం" మేం కాదు. ఆమెతో అతి ముఖ్యమైన విషయాలు కొన్ని మాట్లాడాలి."

"అంత రాసిమా! ఐతే ఎల్లి మాట్టాడు బాబూ - నువ్వొచ్చేతలకి వంట సిద్ధంగా జేసిపెడతాలే! లేక అక్కడే తినొత్తవేమో చెప్పు, నాకీ పని తప్పుద్ది."

రాజు, ఆమె వేసే కొంటె ప్రశ్నలకు వుక్కిరి బిక్కిరై పోతున్నాడు. ఆమె నేదో అనాలనుకొన్నాడు గానీ, తమకు సమీపంలో ఓ కొయ్యలా నిలబడి వుండటం గమనించి అటు తిరిగాడు. ఆమె ఎవరో గుర్తించి, ఏమిటనబోతుండగా రమణమ్మ తనకన్న ముందే కలిపించుకొని "యీవేళలచ్చి యిటొచ్చావ్-నాతో యేమన్నా పనా?" అంది.

"కాదు రమణమ్మ - రాజుగోర్ని చిన్నమ్మగోరు పిలుచుకు రమ్మంది-" అంది చటుక్కున. రాజు వళ్ళు పులకరించింది. వెదకబోయిన స్వర్గం అరచేతిలోకొచ్చి వాలినట్లయింది. తనకుగా తాను వెళ్ళడంకంటే, ఆమె పిలుపుపై వెళ్ళటం ఎంత గౌరవం! ఎంత మర్యాద!

"ఇంకేం, నీకన్నాముందే అమ్మగోరు కబురంపింది. తొరగా తొరగా ఎల్లు. కళ్ళు లొట్టబోయేట్టు ఎదురు సూత్తుండేను" అంటూ రమణమ్మ వెళ్ళిపోయింది. రాజు ఆమె వెళ్ళినవేపే మిరి మిరి చూచి లచ్చువమ్మను ముందు పంపించి వెనకాతలే తనూ ఓంకారయ్యగారింటికొచ్చాడు. ఇంటివద్ద ఓంకారయ్యవున్న అలికిడి లేదు. పొలమెళ్ళినట్లు లచ్చువమ్మద్వారా తెలిసింది.

రాజు దక్షిణపువేపు గొంది దారిన మేడలో ప్రవేశించాడు. తన కోసమే ఎదురు చూస్తున్నట్లు లలిత అక్కడ ప్రత్యక్షమైంది. ప్రసన్నమైన ఎఱ్ఱని ముఖంలో వన్నెలు చిన్నలొలికించు కుంకుమబొట్టు పెట్టింది. వంకెల తల నున్నగా దువ్వి రెండు జెడలువేసి చాలినన్ని సన్నజాజులు వాటి పొడవునా పొదిగి, అందొకటి కుడిచేతపట్టి కమ్మని సువాసనలు ఆస్వాదిస్తోంది. సింగారించుకొన్న గులాబీరంగు సిల్కుచీర గాలికి రెపరెపలాడుతూంది, అప్పుడప్పుడు పరధ్యాసవల్ల తొలగిన పయ్యెదను వులికిపడి సవరించుకొంటూంది.

"నేను రావాలనుకొన్నాను. అంతలోకి మీరే కబురుచేశారు."

"ఔను దాన్ని పంపించి చాలాసేపయ్యింది. మీరెవరితోనో మాట్లాడుతూంటే పిలవడం భావ్యం కాదని అక్కడే నిలబడిందట."

"అంత అర్జంటా?"

"లేదనుకోండి - నిలబడ్డారేం వచ్చి కూర్చోండి" అంటూ అంతక్రితమే సిద్ధంగా వేసివుంచిన పేముకుర్చీ చూపించింది. రాజు నిస్సంకోచంగా వెళ్ళి కూర్చున్నాడు. ఆమె లోనికివెళ్ళి రెండు నిముషాలలో ఫలహారం తెచ్చి అతని కందించింది. అతను అదేమని అడక్కుండానే ఆర గించి, కాఫీగ్లాసు అందుకొని కాస్త కాస్త గుటక వేస్తు న్నాడు.

"మరిలాంటివి అలవాటుచేస్తే మానుకోలేక చచ్చి పోతాం" అన్నాడు ఆమెవైపు దృష్టి సారించకుండానే.

అది ఆమెకు వినిపించినా మారు మాట్లాడలేదు. ఆమె ఆలోచనలన్నీ లచ్చి చెప్పిన వాటిమీదికే పోతు న్నాయి. ఎవరో రమణమ్మట! ఆవిడతో యితనికింత సన్నిహితం వుండటానికి కారణమేమిటో! ఒకవేళ ఆవిణ్ణె యితగాడేమైనా ప్రేమించాడా? తనను కాదని ఇంకొకరికి మనసివ్వగలడా? తానతనిలో అన్నివిధాలా ఐక్యమైపోదా మనుకున్నదే! పానకంలో పుడకలా ఇదేం పనీ! ఇంతకూ తన మనస్సు విడమర్చి చెప్పలేక పోవటం వచ్చింది! లేకుంటే ఆమెతో పల్లెత్తి మాట్లాడగలడా? కన్నెత్తి చూడగలడా? ఛీఛీ ఏమిటీ వెర్రి అహంకారం. అతను ఎవరితో మాట్లా డినా అదేమనుకోడాని కతనిపై తన కేమిటి హక్కు? నిజమే! కానీ, ఏదో అమోఘమైన శక్తి అతనిపై తనకీ అధికారమున్నట్లుగా ప్రేరేపించించింది. ఐనా తానీ విష యంలో తొందరపడక అన్నీ మనస్సులోనే వుంచుకోడం మంచిదనుకొంది.

"ఇవ్వాళ నా పుట్టినరోజు పండుగ రాజూ! అందు కనే కబురంపా. ఈ సమయంలో మీకో బహుమాన మివ్వాలనివుంది. స్వీకరిస్తారా?"

"ఓ, యివ్వాలేగాని స్వీకరించడానికేం" చప్పున లలిత దగ్గరవున్న తన రూపబింబాన్ని రాజుకు చూపించి "ఇదే మీకివ్వదలచిన బహుమానం తీసుకోండి!" అంది. రాజు దాన్ని కళ్ళముందుంచుకొని తదేకంగా చూస్తూ చాలా బాగుంది. నాదగ్గరే వుంచుకుంటాను" అంటూ జేబులో పెట్టుకొని ఆమెవంక దృష్టి సారించాడు. ఆశ్చర్య పోయాడు. ఆమె ముఖాన్ని ఏవో తెలియని సిగ్గుతెరలు క్రమ్ముకొన్నాయి. చెక్కిళ్ళు కంది ఎర్రబడినట్లయినాయి. ఇంక ఆ ముఖాన్ని ఎందుకో తనకు చూపించడానికి జంకుతున్నట్లు రెండుచేతులా కప్పుకొని వ్రేళ్ళకు మధ్యగా మందదృక్కులు సారిస్తోంది.

"లలితా! ఏమిటది? నన్ను చూట్టం భయంగా వుందా!" అంటూ రాజు అమాయకంగా లేచి ఆమె చేతుల్ని ముఖంమీదనుంచి తొలగించడానికి ప్రయత్నించాడు. కాని ఆమె అందకుండా ఎదురుగా వున్న గదిలోనికి పరిగెత్తింది. రాజు ఆమెను వెంబడిస్తూ "లలితా! నాకేమీ అర్థం కావడంలా! ఏమిటిది?" అని దగ్గరకెళ్ళి అప్రయత్నంగానే ఆమె చేయి పట్టుకొన్నాడు

లలిత అతని చేతుల్లోకి తూలి పడింది. రాజు హృదయానికి హత్తుకొన్నాడు. ఆమె కోమల హస్తాలు అతని

మెడను తామర తూండ్లలా మెలివేసుకొన్నాయి. కాసేపలా మాటా - పలుకూ లేకుండా మౌనంగా గడిచిపోయింది.

"లలితా! యిలా అయితే నాకర్తవ్యాన్నే మరిచేటున్నాను." అన్నాడు రాజు.

"అంత బాధపడుతున్నారా అంది లలిత.

"లేదు" అని అంటూండేసరికి హఠాత్తుగా చంద్రమతి ప్రత్యక్షమయింది. కూతుర్నీ - కోయ్యలావున్న రాజునీ చూచి వుడికిపోయింది.

"ఒసేవ్ - ఏమిటే ఇది! ఏమయ్యా నువ్విక్కడి కెందుకొచ్చావ్?' అని అడుగుతూండగానే రాజు చరచరా బయటకొచ్చాడు.

బయటకొచ్చేసరికి యమదూతల్లా కోటయ్యను గుద్దుకొంటూ, తోసుకొంటూ ఓంకారయ్య, కరణం, మునసబు, యింకా-పుల్లిగాడు వెట్టివాళ్ళు అంతా ప్రవాహంలా వచ్చిపడ్డారు. ఓంకారయ్య తన చేతిలోవున్న కొరడాతిప్పి చెళ్ళుమనిపిస్తూంటే "బాబో అంటూ దిమ్మరపోతున్నాడు కోటయ్య.

ఈ వెధవ, వాళ్ళకా వార్త అందించబట్టే ఆనాడు గొడ్లను తోలుకెళ్ళారు. పీడి చర్మం వలవండి" అంటూ కరణం, మునసబులు పెంకులు లేచిపోయేట్లు అరచారు.

ఇంక రాజు నిలువలేక పోయాడు. ఆ దృశ్యాన్ని కండ్లారా చూస్తూ తాల్మి పట్టలేకపోయాడు.

"ఒరేయ్ పుల్లిగా! ఎందుకురా అలా గొడ్డులా కొడతారు" అంటూ సింహంలా గర్జించాడు.

"ఒరే పెట్టీ, ఒరే పుల్లిగా వాణ్ణికూడా పట్టి కట్టెయ్యండి!" అని కరణం, మున్సబులూ "చూస్తారేంరా, ఆ వెధవకూడా యిక్కడే దొరికాడు" అని ఓంకారయ్యా అనే సరికి పుల్లిగాడు రాజుమీదకి దూకి పట్టుకోబోయాడు. రాజు వచ్చినవాడొచ్చినట్టు గడ్డంక్రింద ఒక్క పోటు పొడిచాడు. వాడు గింగిరాలు తిరుగుతూ అల్లంత దూరం వెళ్ళి పడ్డాడు. ఈదఫా అందరూ ఒక్కమ్మడిగా మీదికి వెళ్ళారు. శాయశక్తులా రాజు అందర్నీ చెలుగుతూనే వున్నాడు. అంతలోనే ముందు దెబ్బలుతిన్న పుల్లిగాడు వెనకపీటీనివచ్చి రాజు రెండు చేతులూ విరచిపట్టాడు. దాంతో అందరూ మీదపడి ఇష్టమొచ్చినట్లు బాదబోతూంటే, అప్పుడే యీ కబురువిన్న లలిత పరుగులమీద వచ్చి రాజును విడదీసింది.

నాన్నా - ఇతన్నెవరూ కొట్టవద్దు-కొడితే ముందు నన్ను కొట్టండి-" అని అడ్డుపడింది.

"ఎంత దయగల నంగనాచివే? పుల్లిగా! ముందు దాన్నిటు లాక్కురారా' అంది. అంత దూరంలో నిప్పులు చెరుగుతూ నిల్చున్న చంద్రమతి.

"నన్నెవరూ ముట్టుకోవద్దు. ముందు రాజును బయట కెళ్ళనివ్వండి."

"హుం చూస్తారేం! దాన్ని లాక్కొనివెళ్ళి ఓ గదిలోపెట్టి తాళం వెయ్యండి."

పుల్లిగాడు ఆమె రెక్కబట్టి బలవంతాన లోపలికి లాక్కొనిపోయాడు.

ఆ తర్వాత రాజునీ, కోటయ్యనీ సిమెంటు గుంజకు కట్టి ఓంకారయ్యతో సహా అందరూ చావమోదారు. వంటిమీద తోళ్ళు లేచి, నెత్తురు కారుతున్నా వదిలి పెట్టడం లేదు.

ఇంతలో అకస్మాత్తుగా వెనుక నుంచి ఒక పొలికేక వినిపించింది. యేసోబూ, రాందాసూ - మరో వందమంది బెలబెలా హాల్లోకి తోసుకు వచ్చి, అక్కడ వున్న వాళ్ళందర్నీ తలో కటీ లంకించుకొనే సరికి, వాళ్ళు ఎలా గోలా తప్పించుకొని ప్రక్కగదుల్లోకి పరిగెత్తి తలుపులు బిడాయించుకొన్నారు.

వెళ్ళి తలుపు గుద్దుతూ పగల గొట్టాలని చూస్తుంటే రాజు మూల్గుతూ చేయెత్తి వద్దని సైగ చేశాడు.

వాళ్ళు గబగబా ఆ యిద్దరి కట్లూ విప్పారు. ఇద్దరూ 'సోయి' దప్పి క్రింద పడబోతుంటే, రాందాసూ, ఏసోబూ చెరొకర్ని భుజంమీద వేసుకొని వెళ్ళిపోయారు.

## 10

వారం రోజులు మంచం మీదనుండి లేవలేక పోయారు రాజూ, కోటయ్యలూ. ఇద్దరికీ రాజు ఇంట్లోనే శుశ్రూషలు జరిగాయి. కొరడా దెబ్బలు మానిపోయినా

చర్మం మాత్రం అంతవరకూ ఫ్రాడిపోయింది. వీరిద్దరికీ చాకిరి చేయలేక రమణమ్మ చచ్చిపోయింది. కాపులకు ఉడుకునీళ్ళు కాయటం దగ్గనుంచి గంజనీళ్ళ వరకూ తానే స్వయంగా చూచుకునేది. రాందాసూ, ఏసోబులసలు మంచంపద్దనే పడిగాపులుపడి వుంటున్నారు. ప్రతిపూటా పల్లెనుంచీ, పేటలనుంచీ చీమలబారులా జనం వచ్చి చూచి పోతూనే వున్నారు. అందరిలోనూ ఆవేశం వుట్టి పడుతోంది. దీనికితగ్గ ప్రతీకారం చేయాలని పెద్ద సంచలనం బయలుదేరింది. దేనికైనా ఓ సమయమూ, సందర్భమూ వుండాలని రాజు అందరికీ సద్దిచెప్పాడు. అంత మాత్రానే కోపాగ్ని చల్లారుతుందా? ఐనా రాజు చెప్పింది శిరసావహించి కోపం దిగమింగారు.

కానీ రమణమ్మ కోపమూ, మాటలతీరూ చిత్రంగా వుంది. ఆమె సూటీపోటీ విసురులు అందరికీ అర్థం కాకపోయినా రాజుకుమట్టుకు శూలాలై తాకుతున్నాయి.

"అమ్మగార్ని సూడాలనెల్లేవ్ — అయ్యిందిపని" అంది. ఈ మాటలు అంటున్నప్పుడు రామదాసూ, ఏసోబులక్కడే వున్నారు. అంచేత రాజు మాట్లాడలేకపోయాడు.

"సూసేదాకా కాలు నిలవనిస్తేగా - మోజల్లాంటిది.

ఈసారి రాజు ఊరుకోలేకపోయాడు - ఊరుకొంటే ఆమె మాటలకు హద్దుండదనుకున్నాడు.

"రమణీ! ఒక వ్యక్తిని పరీక్షించాలంటే కొన్ని పనులూ, సమయాలూ వుంటాయి. ఊరికే అపార్థం చేసుకొని చెప్పిపోడిస్తే లాభంలేదు."

"ఇంతకూ మా అమ్మాయనేదేమిటి రాజబాబు" అని తికమకపడుతూ రాందాసడిగాడు. దీనికి జవాబేమి స్తుందో విందామని ఏసోబు చెవులు నిక్కించి కూర్చు న్నాడు.

"ఏంలేదు. తెలిసీ తెలీనిమాటలు" అంటూ రాజు సంభాషణ మార్చదలచి "రమణీ! యివ్వాళ కొత్త గుడ్డ లుతికి పెడ్దూ. ఈ వారంనుంచీ గుడ్డలిలాగే పడున్నై - చాకలికూడా రావటంలేదెందుకనో-" అన్నాడు.

"నేనే రావద్దన్నాను-" అంది రమణమ్మ.

"అన్నావూ? ఎందుకని?-"

"చాకలెందుకులే - మనాటితోపాటు ఆటినికూడా ఓ దెబ్బేసి పెట్టమని నాన్న చెప్పాడు-సరేనన్నాను."

రాజు రాందాస్‌కేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఔన్రాజబాబూ అమ్మ యెట్టాగో సనువుగా ఆపనీ యీపనీ చేసి పెడుతుండాదిగన్క - ఈ పనికూడా చేసిపెట్ట మని నేనే చెప్పా-"

రాజు ఏమీ మాట్లాడలేదు. రమణమ్మ వెళ్ళి గుట్టగా పడివున్న గుడ్డలన్నీ తీసి విదిలించి ఒక్కొక్కటే మడిచి ఓలుంగీపంచెలో వేస్తూ లెక్కబెట్టుకొంటూ వుంది. గబు క్కున ఓ చొక్కా జేబులోంచి విదిలిస్తుండగా ఫొటో ఒకటి క్రింద పడింది. రమణమ్మ దాన్ని అందుకొని ఈర్ష్యగా అటూ యిటూ పరీక్షించింది

అది ఒక స్త్రీ ఫొటో. ఆవిణ్ని ఎక్కడో ఎప్పుడో బాగా చూచినట్లు గుర్తు. కాని ఎక్కడైందీమాత్రం సరిగా

గురుతు రావడంలా. ఐనా యీ ఫోటో యితని జేబులో కెందు కొచ్చింది - బహుశా యితనికీ - ఆమెకూ.........

ఔను! లేకపోతే యీ ఫోటో జేబులో వుండదు. పాపం ఆదమరపున దాన్నితీసి భద్రపర్చుకోడం మరిచాడు. ఖర్మంకాలి అది తన చేతికి చిక్కింది. అదేమైనాసరే, అతనడగందే యివ్వకూడదు. ఊరించి, ఊరించి ఏపుకు తినాలి.

ఆమె గుడ్డలన్నీ లుంగీలో మూటగట్టుకొని భుజం మీద కెత్తుకొంది. అంతలోనే లచ్చువమ్మ లోనికొచ్చింది.

ఏమొచ్చావని అడక్కముందే "తవుగ్గి పిలుపికి బైట శిన్నమ్మగోరు ఎదురుచూత్తుండారు. రమ్మనమంటూరా ?" అంది.

రావచ్చు నన్నట్లు రాజు తల అడ్డంగా తిప్పాడు. ఆమె బైటకు అడుగు పెట్టగానే లలిత అక్కడకు రానే వచ్చింది. చుట్టూ ఓసారి పరికించి తనవేపు తదేక దీక్షతో రెప్ప వాల్చకుండా చూస్తున్న రమణమ్మను చూచి చకితు రాలైంది.

"ఏమిటా చూపు ?" అందామనుకొని అంతలోనే నాలుక కొరుక్కుంది. తననుకొన్న రమణి యీవిడే! ఎంత రమణీయంగా వుంది. వెనకోసారి తాను యీవిణ్ణి చూసిందిగాని, ఫలానా ఆవిడ అని రమణి గ్రహించ లేదు! రాజు ఎంత అదృష్టవంతుడు.

లలిత అతని దగ్గరకు వెళ్ళింది. అలా వెళ్ళడం రమణమ్మకు చికాకు కలిగించింది. ఫోటోలోవున్న వ్యక్తిని

చూచుకొనే ఆస్కారం లేకుండా రాజును పూరిద్దా మను కొంది. చివర కావిడే యిక్కడికొచ్చింది. ఎంతివయ్యారం! ఎంత నాజూకూ!! ఈ చిలకల కొలికిని చూట్టానికెళ్ళే నా రాజు తన్నులు తింది.

రమణమ్మకు వుడుకుమోత్తన మొచ్చింది. యింకా ఆ ఫొటో తనదగ్గర వుంచుకోడం అదోదండుగ చేటనుకుంది. "ఈ అందాలరాణి ఎవరో జేబులోవుంది తీసుకో" అంటూ అతని రొమ్ముమీద పడేసి మాటతో చరాలున వెళ్ళిపో యింది. ఆ పడివున్న ఫొటోను లలిత చేతికందుకొని "దీని మీద నీతు లేనట్టుంది" అని తనలో తాననుకొని దాన్ని ప్రక్కనే మంచంపై పడవేసి "ఎలావుంది రాజూ - అప్ప ట్నుంచీ రావాలని ఎంతప్రయత్నించినా రాలేకపోయాను."

"ఫర్వాలేదు, ఇప్పుడైనా వచ్చావుగా. మీ చలవ వల్ల యిప్పటికి చల్లగానే వున్నాను."

"ఏం కోటయ్యా! మరి నీ కెట్లాగుందీ?"

"నాకూ పర్వాలేదండమ్మ."

"మరి మా యింటికి రావూ?"

"ఇంకానా? ఈ దెబ్బలు సాలకనా అమ్మ!"

"మిమ్మల్ని చూడందే నే నెట్లా వుండగలను కోటయ్యా-నన్నుకూడా మీలో కలుపుకో కూడదూ."

"అది చెల్లదుండమ్మోయ్. ఎప్పటికైనా పంజ రంలో పిట్టల్లే బుర్రున ఎగిరిపోతావ్" అన్నాడు. ఇంత సేప ట్నుంచి నోరు మెదపని ఏసోబు.

"నిజమే ఏగూట్లో పిట్ట ఆగూట్లోనే ఉండాలి !" అన్నాడు వంతలు పలుకుతూ రాందాసు.

"నే నన్నిటికీ తెగించే వచ్చాను. మీరేమీ అనుకోవద్దు రాజూ! నన్ను మీతోపాటు ఉండనియ్యండి-మీతో కలసి పని చెయ్యాలని చాలా కుతూహలంగా వుంది" అంది లలిత.

రాజు చిన్నగా నవ్వాడు. ఆ నవ్వులో ఏదో వెకిలితనం వెల్లడయ్యింది.

"ఏం రాజూ అలా నవ్వావ్ - నేను పని చేస్తానంటే నమ్మకంలేదా ?"

"లేదని నే ననను - నీ మాటల్నిబట్టి చూస్తే, నువ్విప్పుడు పూర్తిగా యిక్కడుండిపోయి మాకు తోడ్పడుదామనుకొంటున్నావ్ గదూ ?"

"ఔను—అందుకే వచ్చాను."

"అదే అవివేకమంటాను. నువ్వు మాకోరకు పని చెయ్యదలిస్తే మాతోపాటు ఉండి ఏమీ చెయ్యలేవు. పైగా భరింపరాని కష్టపరిస్థితుల నెదుర్కొనవలసి వస్తుంది- మా మేలు తలిస్తే - మీ రక్కడే ఉండి మాగ్గు తెచ్చేట్లు చాలా పని చెయ్యాలి. అదే మాకు చేసే మహోపకారం" అన్నాడు రాజు.

క్షణంలో లలిత మనసు మారిపోయింది. కేవలం రాజుతో కలసి అతని భావాల కనుగుణంగా తోడ్పడాలని వచ్చింది. కాని, అది జరగనివ్వని అనుకొంది. ఓచెంప

రాజెల్లానూ కృషిచేస్తూనే ఉన్నాడు. అదే కృషి మరో చెంగేను కూడా చేస్తే ఇద్దరి కృషి సఫలీకృతం కావచ్చు నని గట్టిగా స్థిరపడిపోయింది.

"రాజూ! నీ భావం నాకు బాగా నచ్చింది. నీ వన్నట్లు అలాగే కృషిచేస్తాను... మీరు కూడ గట్టిగా పని చెయ్యండి" అంటూ నిలవకుండానే వెళ్ళిపోయింది. ఆ తర్వాత రాందాసూ, ఏసోబులు కూడా సెలవు తీసుకొని బయటకు వెళ్ళిపోయారు. రాజు గట్టిగా నిట్టూర్చి ప్రక్కకు వొత్తిగిల్లాడు.

## 11

నిన్నా మొన్నా వర్షాలు కురిసి, యివ్వేళే కాస్త తెరిపిచ్చింది. సందులూ, గొందులూ బురదతో చిత్తడి చిత్తడిగా ఉన్నాయి. పగలే దోమలు బుయ్‌మని మనుషులపై దాడిచేస్తూ ప్రాణాలు తీస్తున్నాయి.

యిలాంటి బాధకు తట్టుకోలేక పోయాడు రాజు. అతనికి పూర్తిగా ఒంట్లో కులాసా చేకూరింది. పొలాలపై పసందైన వాతావరణం అనుభవించి చాలా రోజులైంది యివ్వాళ అలా బయటికివెళ్ళి పొలాలు చుట్టి తుమ్మల డొంకలపై కాసేపు సరదాగా గడిపి రావాలనుకొన్నాడు.

అలా అనుకొంటూనే తుమ్మలడొంక మీదికొచ్చాడు. యిరువైపులా ఉన్న గుబురైన తుమ్మలమధ్య డొంకపై మొలిచిన పచ్చటి గరికపోచలపై కూర్చున్నాడు. తొలకరి జల్లుల స్పర్శతో ప్రకృతికన్య పచ్చని చీర సింగారించుకొని కొంగ్రొత్త శోభలతో ప్రత్యక్ష మౌతున్నట్లున్నది. అక్కడక్కడ పసిడిజల్లులు పల్లాల్లో నిల్చి వెండిలా తళుక్కున మెరుస్తూన్నవి. ఒత్తి పట్టిమయమై బీటలువారిన భూదేవి శీతల తుంగ మొక్కలతో పచ్చల కంబళి కప్పుకొన్న ట్లున్నది. చల్లని పిల్లవాయువులు తాకుతూ పక్షుల కోలాహలం అంతులేకుండా ఉంది. ఎక్కడో పొంచిఉన్న గండు కోయిల గొంతువిప్పి శ్రావ్యమైన శ్రుతితో "కుహూ కుహూ" మని దిక్కులు పిక్కటింప జేస్తూంది. గొఱ్ఱెల మట్టు కడుతూ, చేల మధ్యనే కాపురం చేస్తున్న కాపరిమందను వెంటేసుకొని గుబురైన తుమ్మచెట్లన్నీ వంచి, పసిపిల్లమల్లే వాటికి తినిపిస్తున్నాడు. దున్ని దున్నని చేలల్లో కొండ్ర మధ్య నాటుకుపోయిన నాగళ్ళు వర్షానికి చెదిరిపోయినట్లు బొడిగా బిక్కు బిక్కుమంటూ కనపడుతున్నాయ్—

రాజు కిదంతా కనులపండువుగా ఉంది. ఎంత సేపు చూచినా చూడబుద్ధేస్తుందేగాని, చూపులుమాత్రం మళ్ళించ బుద్ధికావడంలేదు. పట్ట బలవంతాన వెళ్ళిపోదా మనుకొన్నాడు. లేవడానికి సంసిద్ధపడుతూండగా వెనుక నుంచి ఎవరిదో మృదువైన అడుగుల చప్పుడు క్షణంసేపు వినిపించి ఆగిపోయింది. తానటు తల తిప్పకుండానే ప్రక్కన ఓ స్త్రీ నిలబడి ఉండటం గమనించాడు.

"రమణీ! ఎక్కణ్ణుంచి ఇలా వూడిపడ్డావ్!"అన్నాడు కౌతుకంగా.

"పొలంనుంచే—"

"ఏంపని చేస్తున్నావ్ ?"

ఆమె తలమీాద ఉన్న తట్టను అందులోని పార జారి పడకుండా మెల్లగా దించి కిందబెట్టింది.

"చేనేమో తడిసింది. అక్కడక్కడా మొరకలుంటే మా నాన్నొక్కడే ఎల్లి జిమ్ముతుంటే సాయమెల్లే-" అంటూ చనువుగా అతని ప్రక్కన కూర్చుని,

"రాజూ! వాంటో కాసంత బాగుంటే యింటి దగ్గర కాల్నిలవదుగందా!" అన్నది.—

"ఏం!"

"మొన్నటిదాకా ఒకమ్మగోరిని గురించి వాల్లు పూనం చేయించుకొని - యియ్యాల కాసంత కుశాలుగా వుండేతలికి యిటొచ్చేసేవ్ - ఈ బురదలోపడి యిటు రాక పోతే ఏమో! అవునులే! ఇంటినగ్గర కాలు నిలిత్తేగా అయ్యగారికి!!

"నిలవదని తెలిసే యింత ఉపోద్ఘాతం దంచుతావు దేనికి -? అమ్మగారిని చూడందే అయ్యగారికి కాలు నిలుచుద్దామరి ?

ఈ మాట అనేసరికి తక్కున రమణమ్మ ముఖం సిగ్గు సింగారించుకొంది. రెప్పలు అరమోడ్పు పడ్డాయి. చూపులు మాంద్యమయ్యాయి

"అంతా అబద్ధం. నాతో పరియాసం ఆడు తుండావు."

"లేదు రమణి! నువ్వు నాకు చేస్తున్న సేవ మరువ లేను. మరువాలని ప్రయత్నించినా దుస్సాధ్యం."

అట్టానే అంటార్లే బాబూ మొగోళ్ళు. ఏదైనా చేయిచ్చుకొనేదాకే! అంటూ ఆదమరపులో జారి పడు తున్న పయ్యెదను గబుక్కున సవరించుకుంది—

"అంత సిగ్గొచ్చి పడిందా!" అంటూ పవిటకొంగు పట్టుకోబోయేసరికిసరికి "అబ్బో ఇదెక్కడ్నేర్చార్రో"అంటూ తట్ట నత్తిన పెట్టుకుని కోడిలా గెంతుకుంటూ పరిగెత్తింది.

## 12

నారు బాగా ఎదిగి ఏతకు సిద్ధంగా వచ్చింది. కూలీలకు ఎద్దడి వచ్చింది.

రైతు కూలీలకోసం హడావుడి పడుతున్నాడు— ఎక్కడవిన్నా రెండున్న మూడువరకు రేటు పెరిగి కూలీ లకు గిరాకీ తగిలిందనేవాళ్ళేగాని, ఆ రేటు యిచ్చేవా ళ్లెవరో మాత్రం బైటకు రావడం లేదు. అసలు అంతవర కిస్తారా అన్న అనుమానంకూడా వేస్తోంది. ఎంచేతనంటే మరోవేపునుంచి రూపాయి, రూపాయిన్నరకంటే పైన నయాపైసా ఇచ్చేది లేదని పుల్లిగాడు బూర తగిలించుకొని

ఊరంతా ఊదుతూనే వున్నారు. ఆ మాటే ప్రతి రైతు నోటా ప్రబలి రెండున్నర, మూడు మరుగున పడిపోయింది. అంతకూ రాకుంటే పొరుగూళ్ళనుంచి కూలీల్ని దించుతా మని బెదిరిస్తున్నారు. ఈ బెదిరింపు ఓంకారయ్యగారినోట బాగా వినవస్తూంది. ఆయనెంత బెదిరింప జూచినా ఆ పప్పు తేం ఉడకనివ్వడంలేదు రాజు. పొరుగూరునుంచి ఒక కూలీకూడా యీ గ్రామంలో అడుగుపెట్టటానికి వీల్లేదని తనవాళ్ళందరికీ చెప్పేశాడు. ఈ విషయమై లలితమీదకూడా కొంత బాధ్యత పెట్టాలనుకొన్నాడు. ఆవిడతో మాట్లాడి అప్పగించిన పని ఎంతవరకు నెరవే ర్చిందో కనుక్కుందా మనుకున్నాడు. అదీగాక ఇవ్వాళ ఉదయాన్నే లచ్చువమ్మద్వారా లలితవద్దనుంచి కబురొ చ్చింది. పాఠశాల ఆవరణలో మహిళలంతా కూడి వన మహోత్సవం జరుపుతున్నారట. నీడకోసం ఈ రకాల చెట్లు అక్కడ నాటుతారట! దీనికి తనుకూడా హాజరు కావలసిందని అభ్యర్థన.

రాజు పాఠశాలదగ్గర కొచ్చాడు. ఆవరణలో ఇరుగు పొరుగు మగవాళ్ళు తప్ప అందరూ ఆడవాళ్ళే. అందరి చేతుల్లోనూ వేప, చింత, నిద్రగన్నేరు, గంగరావి, ఇలా రకరకాల మొక్కలున్నాయి. వన మహోత్సవాలంటే యీ ఊళ్ళో ఆడవాళ్ళ కెంతో సరదా.

రాజు ఆవరణలోనికి వెళదామనుకొన్నాడు. అక్కడ వున్న సీమంతినీ సమాజంలో ఒక్కరూ తెన్నెరిగిన ముఖం కనిపించలేదు. కనీసం లలితైనా అక్కడ కనపిస్తుం దను

కొన్నాడు. ఆమె జాడకూడా అక్కడ లేదు. ఇంకా వెనక్కి వెళదామని తిరిగాడు.

ఇంతలో "రాజూ" అంటూ ఎవరో వెనుకనుంచి పిలిచినట్లయింది. అతను వెనక్కి తిరిగాడు. గాజువన్నె సిల్కు చీర సింగారించుకొన్న లలిత, చేతిలో పూల మొక్కలు మొలపించుకొని చిరునవ్వుతో తన పక్కన వచ్చి నిలబడింది.

"లలితా! కనిపించలేదేం!! ఇప్పటిదాకా ఎక్కడున్నావ్-" అన్నాడు.

గాలికి రేగిన వెంట్రుకలు చెంపలమీద పడుతూంటే వెనక్కి నెట్టుకుంటూ, మలయమారుతం తాకిడికి చీర కుచ్చిళ్ళు మోకాళ్ళపైదాకా ఎగిరెగిరి పడుతూంటే చేత్తో నొక్కిపెట్టి కొంగు కొసను బిగువుగా దోపుకొంటూ "వాళ్ళల్లోనే వున్నా. నువ్వు సరిగా చూడలా. సరేగాని యింతావచ్చి వెళ్ళిపోతున్నావేమిటి? మాతోపాటు నువ్వూ రెండు మొక్కలు పాతు" అంది లలిత.

"అది నావల్ల కానిపని. ఆ పనేమిటో మీరు చూచుకోవలసిందే - ఆడవాళ్ళు చేసేపని నాకెందు కప్పగిస్తావ్!" అన్నాడు రాజు.

"అయితే వస్తానంటూ ఆమె నలుగురితోనూ మొక్కలు పాతించడానికని వెళ్ళిపోయింది. ఆమె చూచిన చోటల్లా మొక్కలు నాటినతర్వాత అమ్మలక్కలందరూ ఓ మర్రిచెట్టు నీడన పోగయ్యారు. అందులో ఒక్క

క్కళ్ళూ లేచి వనమహోత్సవాన్నిగూర్చి ఘనమైన అభి ప్రాయాలు వెలిబుచ్చారు.

చివరికి లలిత లేచి, యిలా ఉపన్యాసం ప్రారం భించింది.

"మనం వనమహోత్సవాల పేరిట ఇలాంటి పాఠశాల ఆవరణలూ, రోడ్డులూ మొక్కలతో ముంచేస్తున్నాంగాని, దాని ధ్యేయమేమిటో తెలుసుకోలేకపోతున్నాం. భారత ప్రధాని సైతం ఒక్క మొక్కైనా నాటందే వుండలేదు. ఎందుకీ పిచ్చి? కారణాలు చాలా ఉన్నాయి. అవన్నీ ఏకరువుపెట్టడం కష్టంగాని మచ్చుకొకటిరెండు చెపుతాను- వనమహోత్సవంలో నాటే కొన్ని ఫలవృక్షాలు మనకు పుష్కలంగా పండ్లనిస్తాయి. బొగ్గుపులుసు వాయువుల్ని హరించి ప్రాణికోటికి అత్యంత ముఖ్యమైన ప్రాణవాయు వుని ప్రసాదిస్తాయి. వాన లెక్కువ రావడానికి ఉపకరి స్తాయి. చక్కని గాలి, చల్లని నీడా యిస్తాయి. మనస్సుకు ఎంతో హాయిని చేకూరుస్తాయి. యింతగా ఉపకరించే ఈ ఉత్సవాన్ని మన మెప్పుడూ మరువరాదు...."అంటూ కాసేపాగి అందరివంకా తేరిపారచూచింది. అందరూ ఆమె చెప్పేది మౌనంగా వింటున్నారు. ఆమె మళ్ళీ ముఖభంగిమలు మార్చి చెప్ప నారంభించింది.

"ఐతే ఇలాంటి శ్రద్ధ ప్రతి విషయంలోనూ చూపిం చడం మంచిది. కేవలం మన మహోత్సవాలు జరిపి ఏదో ఘనకార్యం సాధించామని సంతోషిస్తే చాలదు. ప్రస్తుత

ప్రపంచంలోని లోటుపాట్లుకూడా గమనించాలి. వాటన్ని టినీ బయటకు లాగాలి. సంపన్న కుటుంబాల్లో జన్మించిన మనలాగా కాక కష్టించి చెమటోడ్చే శ్రమ జీవులకు తగిన ప్రతిఫలం దొరుకుతోందా లేదా అనేది ఆలోచించాలి ఈనాడు ఊళ్ళలోచ్చాయి. కూలి ఎంత ఇస్తే న్యాయమో పరిశీలించాలి. ప్రతిదానికి ధరలు విపరీతంగా పెరిగాయే! రూపాయి యిచ్చి సరిపుచ్చుకోమంటే సరిపోతుందా?...."

యింతలో ఒకావిడ లేచి "మరి ఎంతిస్తే సరిపో తుంది ?"—అని అడిగింది.

"ఒకనాడు తక్కువ, యింకొకనాడు ఎక్కువ అనే మాటలేదు. ఒక నిర్ణీతమైన రేటు ఏర్పాటు చేసుకోవటం మంచిది. ఇన్ని పనిగంటలని ఏర్పాటు చేసుకుని రెండూ- రెండున్నర చొప్పున ఆడా మగ కూలీలకు ముట్టజెప్పాలి - అప్పుడే శాస్త్రోక్తంగా సాంఘికన్యాయం మనం చేకూర్చిన వాళ్ళ మౌతాం...."

"ఇది జరిగేపనేనా ?" అంది ఇందాకటావిడ మళ్ళీ.

"ఎందుకు జరగదు ! మన మందరం మనవాళ్ళకు చెప్పాలి."

"అది దేవుడితరం కాదు. రెండూ రెండున్నర యివ్వడమంటే మాటలా. ముందు మీ నాన్నకు చెప్పి ఆ లెక్కన యిప్పించు."

"మా నాన్న యివ్వడని గట్టిగా తెలుసు. అంత మాత్రాన ఈ మంచి ప్రయత్నాన్ని మానుకొంటానా?"

"ఆ సంగతి నీకనవసరం. యింట గెలిచి రచ్చ గెలవమన్నారు. మీ నాన్నకు చెప్పి చేయించగలిగితే—నువ్వు మాకు చెప్పే పనే ఉండదు."

"మా నాన్న ఎవరు చెప్పినా వినేరకపు కాదని మీ అందరికీ తెలుసుగదా! అందుకని మీకు నచ్చచెప్పి చేయిస్తే మా నాన్నకికూడా తెలిసొస్తుందేమోనని అనుకొంటున్నా—"

"ఇంకా నోరుముయ్యమని నేననకుండానే వీళ్ళంతా మీద పడతారు. చాలుచాల్లే!" అంటూ ఆవిడ అందరినీ బెలబెలా లేవదీసికెళ్ళిపోయింది. లలిత బిక్కుబిక్కుమంటూ ఒక్కర్తే నిలబడివుంది. యింతసేపటినుంచి చెట్టు చాటున పొంచి ఉన్న రాజు ఇవతలకొచ్చాడు.

"రాజూ ఇంకా ఇక్కడే ఉన్నావా?"

"ఆఁ ఉన్నా."

"ఐతే మా సంభాషణ వినే ఉంటావు."

"విన్నా - వాళ్ళన్నదాంట్లోను సబబుంది. ముందు మీ నాన్నను మార్చు."

రాజు మాటలామెకు ములుకుల్లా గుచ్చుకున్నాయి. అతనూ వాళ్ళతో ఏకమైపోయాడనుకొంది.

"నువ్వూ అంతే అంటున్నావా?

"ఔను. యింటగెలిచి రచ్చ గెలవమన్నమాట యదార్థం."

ఆమె ఆవేశంతో వూగిపోయింది. రాజును చెడామడా నాలుగనాలనుకొన్నది. కానీ నోరు విప్పకముందే

రమణి రొప్పుతుంటూ అక్కడికొచ్చిపడింది. ఆయాసంతో నోటి మాటరాక కాసేపు ఉక్కిరిబిక్కిరై "రాజూ! ఓంకారయ్య పొరుగూర్నుంచి జనాన్ని లారీల్లో దించుతుండాడు. మా నానా, ఏసోబు, కోటయ్యతాత ఆళ్ళ నడ్డుకొంటూ ముత్తేలమ్మ మానుదగ్గిర ఉండారు. యామవుద్దో యామో. తొరగా కదిల్రా రాజూ-" అంటూ లలిత వేపు సరుక్కున ఒక్క చూపు విసిరి పరిగెత్తిపోయింది. ఆ పరుగు చూసి లలితకు వళ్ళు మండింది.

"వొత్తి చిందులుగుఱ్ఱం!" అని లోలోన అనుకున్నది. ఐనా ఏమంటాడో అని ఎదురు చూస్తోంది.

రాజు ఇవేమీ గమనించడంలేదు. అక్కడేమి జరుగుతుందోనన్న ఆదుర్దాతో లలితవేపు చూడనైనా చూడకుండా ఒక్క దవుడుతీసి ముత్యాలమ్మ మానువద్దకొచ్చి పడ్డాడు అక్కడ జనం కిటకిటలాడుతున్నారు. అందరి చేతుల్లోనూ, బడితెలూ, బరిసెలూ, పసికట్టులూ ఉన్నాయి. వీళ్ళందరూ ఎవరైందీ గుర్తు తెలీడంలేదు. తూట్లుపడీ, పీలికలైయున్న మలినవస్త్రాలు వాళ్ళ శరీరాలపై జీరాడుతున్నాయి.

"ఒరే, యింక ఎల్లిపొండిమీరు. లేకుంటే పేణాలు పోతై" అంటూ ఆ జనంలోనుంచే ఏసోబుగొంతు భయంకరంగా వినవచ్చింది. అంతలోనే పెటపెటమంటూ కర్రలు కలిశాయి. కొందరు "బాబో" అన్నారు. కొందరు "హామ్మయ్యో" అంటూ అరచారు. తను ఆగలేక ఆ జనంలోకి దూరిపోయాడు. కోటయ్యతాత జనంలోనుంచి

తూలుతూవచ్చి తన్నుగట్టిగా కావలించుకొన్నాడు-ఆతని తలమీద రక్తం కారుతుంది.

"బాబూ. నువ్వెనక్కి పో-రాందాసూ, ఏసోబూ ఆ జనంలో యామన్యోరో తెలీదు" అంటూ వెనక్కి నెట్టుకుపోతుంటే రాజు, విడిపించుకొని బలవంతాన ముందుకు తోసుకు పోయాడు. హఠాత్తుగా రాందాసూ, ఏసోబులు సోయలేకుండా క్రిందపడివుండటం చూశాడు. వాళ్ళకి అపాదమస్తకం రక్తమయమైపోయింది. వాళ్ళిద్దరి చుట్టూతా చాలమంది నిలబడివున్నారు. వాళ్ళకు పది గజాలెడంగా ఓంకారయ్యని, పుల్లిగాడిని ముందు పెట్టుకుని నాలుగైదొందలమంది పాటక జనం పరవళ్ళుతొలుతూ నిలబడ్డారు. వాళ్ళివూరికి చెందినవాళ్ళుకాదని ఆ ముఖాలు చూడగానే తెలిసిపోయింది. దీన్నిబట్టి ఓంకారయ్య ఎంత కుతంత్రంగా ప్రవర్తించాడో అర్థమైంది. పొరుగూళ్ళనుంచి రప్పించిన కూలీలతోనే తనవాళ్ళమీద దాడి చేయించాడు. ఎంత కుయుక్తి! వాళ్లూ కష్టిస్తేగాని కడుపు లిడవని పామరజాతివారే. ఐతేనేం! ఆలాంటివాళ్ళందరినీ రెచ్చగొట్టి తనవాళ్ళను చిత్తుచిత్తుగా శాదించాడు. ఇక్కడ తన బలగం తక్కువైంది. అంచేతనే ఓంకారయ్య, పుల్లిగాడూ అంత దండిగా, వచ్చి వాళ్ళముందు నిలబడ్డారు. లేకుంటే యీ పంచలకైనా తొంగి చూడగలరా?

"-ఇదిగో-నేస్తాలూ! మీరు మాలాంటి కష్టజీవులే-ఇక్కడ కూలిరేట్లకొరకు మేం పాటుబడుతూంటే మమ్మల్ని

కాదని చవుకగా దొరికిన మిమ్మల్ని మా గ్రామంలో దించారు - మీ కష్టానికి తగిన కూలి గిట్టకపోవడమనే సమస్యను మీరు మీమీగ్రామాలలో నిత్యం ఎదుర్కొం టూనే వున్నారు. మనది ఏకైక కుటుంబం. మనమంతా ఏకమై కృషిసల్పితేనే మనహక్కుల్ని సాధించగలుగుతాం. మీరు మా విన్నపమాలకించి మా గ్రామాన్ని వదలివెళ్ళి పొండి -" అన్నాడు.

హఠాత్తుగా ఓంకారయ్య అందుకొన్నాడు—

"అది నీ వల్లగాని పని, నువ్వు వెళ్ళమనగానే వాళ్ళ కొచ్చే భుక్తి పోగొట్టుకొని వెళ్ళే మూర్ఖులుకాదు! మర్యా దగా మాతో పంతంమాని ఇక్కణ్ణుంచి వెళ్ళిపొండి."

"వాళ్ళను వెనక్కి తరలించేవరకూ వెళ్ళేపని లేదు."

"హూఁ చూస్తారేరా" అనటమే తరువాయి పుల్లి గాడూ, తతిమ్మావాళ్ళూ ముందుకు విరుచుకుపడ్డారు. రాజు అంతు తేల్చుకోవాలనుకున్నాడు. వాళ్ళందరూ అతనిమీద పడబోయే సమయంలో లలిత ఆగమని పెద్దగా కేకవేస్తూ వాళ్ళమధ్యకొచ్చిపడింది. కానీ, వాళ్ళాగలేదు. అడ్డం వచ్చిన ఆమెను ఆవతలికి పడద్రోశారు. రాజు ఆగ్రహం ఆకాశాన్నంటింది. ఆ ముందుకొచ్చిన వాళ్ళల్లో ఒకణ్ణి యుక్తిగాపట్టి కర్రలాక్కొని గరిడీ మొదలుపెట్టాడు. ఇంతలో ఆవతలిముఠాలోని ఒకతను అంతకంటే చాకచక్యంగా గరిడీచేస్తూ రాజు చేతిలోనికర్ర పడగొట్టి బుర్ర రెండు ప్రక్కలయ్యేలా కర్రవిసిరాడు. గాని ఆదెబ్బ అమాంతం

అడ్డువచ్చిన లలిత భుజంపై పడింది. లలిత కెవ్వునఅరుస్తూ క్రిందకూలిపోయింది. అప్పటిదాకా కూతురక్కడున్నట్లూ, దెబ్బతగిలి పడ్డట్లూ ఓంకారయ్యకు తెలవదు. చప్పున వాళ్ళందరినీ గద్దించి వెనక్కి రప్పించాడు.

"ఛా వెధవా! నువ్వన్నా చూళ్ళేదట్రా దాన్ని" అంటూ పుల్లిగాడిపై కాండ్రుమున్నాడు.

"లలితా!" అంటూ తడబడుతున్న గొంతుతో— నిలువెల్లా ఆదుర్దాపడుతూ కూతుర్ని లేపబోయాడు. ఇంతలో అదివరకే అక్కడున్న రాజు ఆమెను తనభుజంపైన ఎత్తుకొన్నాడు. ఆమె స్పృహతప్పి నిశ్చేతనంగా వుంది.

"ఈమె మా ఆదర్శమూర్తి మాపట్లజరిగే అన్యాయాన్ని చూస్తూ సహించలేక తెగబడిన త్యాగమూర్తి" అంటూ రాజు కదలబోయాడు. కాని పుల్లిగాడితోసహా ఓ యిరవైమంది అతనిపైబడి ఆమెను బలవంతానలాక్కొని ఓంకారయ్య వెంట వెళ్ళిపోయారు. అక్కడే రాందాసూ, ఏసేబుల చుట్టూ పరివృతులై వున్నవాళ్ళంతా వేలముఖాలతో "పాపం ఆయమ్మ చానామంచిది" అన్నారు. రాజుకదేమీ వినబడలేదు. ఆ గుంపు చీల్చుకొని రాందాసు-ఏసోబు లెలావున్నారో చూద్దామని హడావిడి పడ్డాడు. వాళ్ళపరిస్థితి బాగానేవుంది. కాస్త తేరుకొని మనుషుల్ని బాగా గుర్తుపట్టగలుగుతున్నారు.

"రాజు బాబూ" అన్నారు యిద్దరూ కన్నీరు కారుస్తూ.

తాను మాట్లాడలేకపోయాడు. కన్నీరు కాల్వలుకట్టే

పరిస్థితి వచ్చింది. బలవంతాన ఆపుకొన్నాడు తాను కన్నీరు పెట్టితే వాళ్ళంధైర్యం పూర్తిగా చెడిపోతుందనుకున్నాడు. గుండె నిబ్బరం చేసుకున్నాడు.

ఎవరెంత నచ్చజెప్పినా, గుండెలు పగిలి గొల్లు గొల్లున దుఃఖిస్తున్న రమణమ్మ శోకార్ణవానికి వారధికట్టే వాళ్ళుమాత్రం కన్పడరా.

"రమణీ! నువ్వేడిస్తే వీళ్ళు మరీధైర్యం చెడగొట్టు కుంటారు. నా మాట విని ఏడ్వకు" అని రాజు ఓదార్చాడు.

## 14

మూడురోజులు 'ఓ' అన్నకోటికి విరామం లేక పోయింది లలితకు. కొందరు చెయ్యి తీసివేయాలన్నారు. కొందరదేం అక్కర్లేదని ధైర్యంచెప్పారు. ఆఖరి కెలాగైతేనేం శస్త్ర చికిత్సచేసి చేతికి గాజుపట్టీ తగిలించారు. ఆ పట్టీ పదుం రోజులదాకా విప్పడానికి వీల్లేదని డాక్టరు సలహా. విప్పకపోతే మాన విపరీతమైనబాధతో ఒళ్ళంతా జలదరించిపోతోంది. బ్రతికి యింతబాధ వెళ్ళబోసేకంటే ఆవేళే చచ్చిపోతే ఎంత బాగుండే దనుకొంది. ఆ బాధ కోర్వలేక అన్నపానాలు మానివేసింది. పచ్చి మంచినీళ్ళ తోనే కాలం వెళ్లబుచ్చుతోంది. అసలు దెబ్బకన్నా యిది

లావయ్యేట్టుందని తల్లి చంద్రమతి బేజారైపోయింది. కూతురు మంచం ప్రక్కనే కూర్చొని వలవలమంటోంది. కూతుర్ని యీ స్థితికి తెచ్చినవాళ్లని దుమ్మెత్తిపోయడం మొదలెట్టింది

"అమ్మా! అయిపోయిందిగా. ఇప్పుడని లాభమేముంది?" అని లలిత మందలించింది. ఆ నీరసత్వంతోనే.

"నువ్విలా పడివుంటేనే చూడలేనమ్మా. లేచి ఒక్క మెతుకు ఎంగిలిపడు. నేను తినిపిస్తానుగా తల్లీ!" అంది.

"ఆకలి లేదు. వద్దమ్మా" అంది లలిత.

ఇంతలో ఆగదిలోకి మెల్లమెల్లమెల్లని అడుగులతో లచ్చువమ్మ ప్రవేశించింది. దానిచేతిలో ఏదో చీటీ వుంది. ఆ చీటీ లలిత కివ్వబోయినదల్లా అక్కడే చంద్రమతి వుండడంచూచి ఆగిపోయింది. "ఏమిటే అది?" అంటూ గబాలున చంద్రమతి లాక్కొంది.

దాన్ని విప్పిచూచి "ఎవరిచ్చారే నీకిది" అంటూ మిరిమిరి చూచింది. లచ్చువమ్మ చెప్పడానికి సంశయిస్తుండే సరికి "చెప్పవేమే?" అని రెట్టించింది.

"దారే వొత్తుంటే రాజు బాబుగోరు కనిపిచ్చి ఇచ్చారమ్మా—"అంది నసుగుతూ తడబడుతున్న గొంతుతో–

"హుఁ, నువ్వెందుకు తీసుకొన్నా?" అని కసిరింది. లచ్చువమ్మ మాట్లాడలేదు. అపరాధినిలా తలవంచి నిలబడింది.

"ఏమిటమ్మా అది?" అని లలిత కలిపించుకుంది.

"ఏంలేదులే" అంటూ చంద్రమతి ఆఉత్తరం చించి వేయబోయింది.

"అమ్మా! దాన్ని చించితే: నా ప్రాణం తీసుకొంటా. అదేమిటో ఇటివ్వు!" అంటూ హీన స్వరంతోనే కరుగ్గా అడిగింది. చంద్రమతి గత్యంతరంలేక దాన్ని కూతురు చేతిలో పెట్టింది.

"లలిత దాన్ని విప్పి చదివింది."

"ప్రియమైన లలితకు—

నీ క్షేమ సమాచార మేమీ తెలియదు. వెంటనే లచ్చిద్వారా ఎలావుందీ కబురు అందజేస్తారనుకొంటాను.

ఇట్లు,
నీ శ్రేయోభిలాషి రాజు."

లలిత దాన్ని మడిచి, తల్లివేపుచూచి, "ఇందులో ఏముస్నదమ్మా–" అని అడిగింది.

"ఏం లేకపోయినా అతనికి నీ క్షేమసమాచారా లడగ వలసిన అవసరమేముంది?—"

"చాలావుంది, ఎవరడక్కపోయినా అడిగేదే అతనసలు – నే నెలావున్నదీ అతనికి చెప్పవలసిన బాధ్యకూడా నా మీదవుంది!—"

"ఏమిటే ఆ బాధ్యత ?" అని కొసమాట అందుకొని ప్రశ్నిస్తూ ఓంకారయ్య లోనికొచ్చాడు.

"అమ్మాయికి ఆ రోజునే ఆయన క్షేమ సమాచా

రాలు తెల్పమని చీటీ రాసి పంపారు"అంది అమాయకంగా, చంద్రమతి.

ఇంతలోనే ఎందుకు నోరు జారేనా అని పెదవి కొరుక్కుంది.

"వ్రాశాడూ ? ఏదా చీటీ?"అన్నాడు వురుముతూ. చంద్రమతి మాట్లాడలేదు కనీసం కూతురు వద్ద వున్నదని కూడా చెప్పలేదు.

"మాట్లాడవేమే మూంగి దయ్యమా ? ఎక్కడుంది?" అన్నాడు నోరు చించుకొంటూ.

"నా దగ్గరే వుంది. చింపేశాను" అంటూ లలిత చెప్పేసింది.

"చింపుతావ్ ? ఎందుకు చింపవ్ ! నువ్వాడి తర పున పూసుకోబట్టే నీకీ పని జరిగింది."

"ఫరవా లేదు. మీరేం బాధపడ్డం లేదుగా."

"లేదు. కాని నా కడుపున....

"ఇలాంటిది పుట్టిందేమా అని బాధ పడుతున్నారు అంతేగా."అంది లలిత ఓంకారయ్య మాట సాంతం పూర్తి చెయ్యకముందే అందుకొని.

"ఔను." అన్నాడు.

"మీరా బాధ ఎప్పుడూ పడతారు. న్యాయంగా వాళ్ళడిగిన కూలి రేట్లు వొప్పుకోనంత కాలం అలాగే బాధ పడతారు. వాళ్ళ నిర్ణయం అమలు జరిగే వరకూ శాయ శక్తులా నేను ప్రయత్నించవలసి వుంటుంది."

"అమ్మాయ్. ఈ పంతం మానుకో. మనిద్దరి మధ్యా 'లడాయి' ఎవరన్నా వింటే నవ్విపోతారు" అన్నాడు ఓంకారయ్య.

"ఆరు నూరయ్యేది, నూరు ఆరయ్యేది అనుకున్న దనుకున్నట్టు జరగాల్సిందే. నామీద చూపేదయా, సానుభూతీ కాస్త ఆ పేదవాళ్ళ పట్ల చూపండి. అంది లలిత. దాంతో ఓంకారయ్యకు ఒళ్ళంతా శివమెత్తిపోయింది. కూతుర్నేమీ అనలేక లచ్చువమ్మమీద విరుచుకు పడ్డాడు....

"లచ్చీ! ఆ వెధవ కాగితాలు మోసుకొచ్చావంటే నీ వళ్ళు హూనమైపోతుంది. ఉన్న మూన్నాళ్ళూ జాగ్రతగా మసలుకో. ఆ వుద్యోగం కాస్తా వూడిపోతుంది" అంటూ రుస రుస లాడుతూ వెళ్ళిపోయాడు. చంద్రమతికూడా భర్త ననుసరించింది.

"లచ్చీ! నువ్వేం భయపడకు. భయపడితే నువ్వేం పనిచేస్తావ్! రాజు కనబడితే కొంచెం క్షేమంగానే వున్నా చెప్పు, మర్చిపోకు" అంది. లచ్చువమ్మ అడకత్తెరలో పోకలా నలిగిపోతోంది. అటు ఓంకారయ్య ఆజ్ఞ శిరసావహించాలా యిటు చిన్నమ్మగారి మాట పాటించాలా అన్న మీమాంసలో కొట్టుమిట్టాడుతూ నెమ్మదిగా బయటకు నడిచింది. అంతవరకూ కూర్చుని వున్న లలిత ఎందుకో లేని నవ్వు తెచ్చుకొని నెమ్మదిగా మంచం మీదికి వత్తిగిలింది.

# 15

తగిలిన దెబ్బలన్నీ మాని గవర్నమెంటు ఆసుపత్రి నుంచి బైట పడ్డారు రాందాసూ, ఏసోబులు. కోటయ్యకంత పెద్ద దెబ్బలేం తగలకపోబట్టి ఆసుపత్రితో పని లేకపోయింది. గవర్నమెంటు డాక్టరు దగ్గర సర్టిఫికెట్టు తీసుకొని ఛార్జి పెడదామనుకున్నారు. కానీ కోర్టుల చుట్టు తిరగడం పెద్దఖర్చుతో కూడిన పనని రాజు మందలించడంతో ఆగిపోయారు. వాళ్ళు ఆసుపత్రిలో పడుండగా రమణమ్మ చేసిన సేవ ఇంతింత గాదు. ఆవిడ పుట్టిందే అసలు యితరులకు ప్రాడీగం చేయడానికేమో అనుకున్నాడు రాజు.

వాళ్ళు ఆసుపత్రిలో వున్నన్నాళ్ళు తిరగలేక కాళ్ళరిగిపోయాయి వాళ్ళ అనుయాయులకు. ఎందుకరగవు! వాళ్ళకింక పని పాటా మటుకేముంది? వాళ్ళను ఒక్క పనికి పిలిచిన పాపాన పోలేదు ఊళ్ళో ఎవరూ. ఊడ్పులు కాస్తా పొరుగూళ్ళవాళ్ళే చేసుకు పోయారు.

"నాన్నా! మన శేలోకి ఒక్క సుక్క నీ గ్రాసిపు టము లేదు ఓంకారయ్య పాలేరు. శేలోకి నీళ్ళెడదామని 'బోదె' కడ్డుకట్టేయిచ్చి కోటయ్య తాతతో 'గండి' కొట్టిత్తా వుంటే, ఆ డద్దుకొని అడ్డుకట్ట తెంచేశాడు. శేనెండ్రేసి పోయింది. తొరగా కదలండి నాన్నా" అంటూ ఆ వేళ

పడింది. రమణమ్మ అక్కడే వున్న రాజు కోపోద్రిక్తంతో ముగ్గొనలు రిక్కించాడు. రాందాసు స్థానే తనుండి చేనికి పూడ్పు వేయించాడు. అది ఓంకారయ్య చేల మధ్యనున్న మాట వాస్తవమే. అంతమాత్రానే 'నీరు' రానియ్యడా ? ఆ చేను గట్టిగా ఆ కాల్వకు సరిహద్దు-పారతో ఒక్క దెబ్బ వేసినా నీళ్ళు పొలంలోకి పరవళ్లు తొలుతాయే? ఆ కాల్వ ఓంకారయ్య దొక్కడిదే కాదు. అక్కడున్న రైతు లందరికీ ఆ కాల్వపైనా, నీటిపైనా హక్కుంది. ఓ ఎకరం మాగాణుంది గనక రాందాసూ అక్కడున్న రైతుల్లో ఒకడి గానే భావించాలి. జాయింటు హక్కు దారైన రాందాసు పొలంలోకి నీళ్ళు రానీయక పోవడంలో ఉద్దేశం ?

"రమణి ! నువ్వక్కడి కెందు కెళ్ళావ్ ? అన్నాడు రాజు.

"చెప్పాను కదూ ? పూడిశినా కింతవరకూ శేనుకి నీళ్ళు పెట్టలేదుగందా అని కోటయ్యను ఎంటెట్టుకొని నీళ్ళు పెడదామనెల్లేను. ఆ డద్దు తగిలాడు. అసలే ఎండ్రుమీాను ఊడితి మాయె చేను."

అంది లలిత. దాసూ ఏసోబులు వుగ్ర రూపులై బయలుదేర బోయారు. ఆ పని తానొక్కడే చూచుకోగల నని రాజు వాళ్ళనాపి, పొలం దగ్గరకొచ్చి పడ్డాడు. తన వెనకాడితే రమణమ్మ కూడా వచ్చింది. రాజు అసలాడ వున్న పరిస్థితి చూచాడు. పుల్లిగాడు కర్ర చేత పట్టుకొని కాపలా కాస్తున్నట్లు వెడల్పాటి ఆ గట్టుమీాద గస్తీతిరుగు తున్నాడు. కోటయ్య తాత హాంగుంటే మీాద పడదా

మన్నంత యిదిగా నిల్చుని నిస్సహాయుడై కట్ట తెగిపోతున్న కాల్వ నీటివేపే చూస్తున్నాడు ....

"తాతా! చూస్తావేం బోదె కట్టు!" అన్నాడు హఠాత్తుగా రాజు. గస్తీ తిరుగుతున్న పుల్లిగాడు వులిక్కి-పడ్డాడు. కోటయ్య వెయ్యి ఏనుగుల బలమొచ్చినట్లుగా ఎగిరి గంతేసి బోదెలోకి దిగబోయాడు....

"ఒరే కోటిగా ? నీ బుర్ర రెండొక్కలవుద్ది.కట్టెట్టా వుందో చూసి మరీ దిగు - అన్నాడు పుల్లిగాడు మన్నూ మిన్నూ ఏకమయ్యేట్టు అరుస్తూ.

"ఏసూ నే దిగుతుండా" అంటూ దిగేసరికి అమాంతం కర్ర ఎత్తి విసిరాడు. రాజు తన వద్దనున్న కర్రతో ఆ దెబ్బను తట్టి- వూపిరాడకుండా వాడిపై సూటులు సాగించాడు. వాడు తిట్టుకొంటూ సందు దొరికినప్పుడు కర్ర విసురుతూనే వున్నాడు. ఇద్దరూ ఓ పది నిమిషాలు ఒకరికొకరు 'దాంగ'సూట్లు విసరుకొన్నారు. ఆఖరి కెలాగైతే పుల్లిగాడి చేతిలో కర్ర ఎగిరి దూరాభై గజాలావల పడేట్టు కొట్టాడు రాజు. అంతలోకే రాందాసూ,ఏసోబులు పది పదేను మంది అక్కడికొచ్చి పడ్డారు. పుల్లిగాణ్ని ఆపళంగా పట్టి పై పంచ పెడరెక్కలు విరగట్టి వెనక పీటీన ఒక్క- తన్ను తన్నారు. వాడు బలంగా తూలి పంట చేలోనుంచి బోదెలో పడి తప తపా కొట్టుకొంటున్నాడు.

"రాందాసూ వాడి పని యిప్పుడు కాదు. తిన్నగా వాణ్ని మా యింటికి తీసుకు పదండి!" అన్నాడు రాజు. వాణ్ని ఆట్టే బోదెలోనుంచి రాందాసూ ఏసొబులు నెట్టు

కంటూ పోయారు. కోటయ్య యింకా యీ కాల్వతోనే సతమతమౌతున్నాడు.

"తాతా! నీ వల్లకాదు. నే సద్దువేస్తా, ఆ పార నాచేతి కివ్వు—" అని తీసుకొన్నాడు రాజు. తను వంగి బోదెకు అడ్డకట్టవేస్తుంటే రమణమ్మ సాయంవచ్చింది. ఇద్దరూకలసి గజమెత్తు కట్టవేసి ఒడ్డెక్కారు. ఈ లోపల కోటయ్య చేలోకి నీళ్ళు మళ్ళించి తనూ గట్టెక్కాడు.

"పొలంపన్లోకూడా ఆరితేరింది. తాతా! రమణి అసలు మొగాడై పుట్టవలసింది!"

"పో రాజా! నాకోపమొచ్చిందంటేనా—"

"కొట్టవుగదా!.... ....?"

"ఉహూ! కొట్టేపాటి కేత్తుంటే ఆమాటే అనవుగా?—"

"మీరిట్టా ఆటకాయతనంగా నడిత్తేకాదు రాజుబాబు. ఆళ్ళెళ్లేరు; తొరగానడవాలి—"అన్నకోటయ్యమాట చెవిని పడగానే వాళ్ళిద్దరూ గబగబా నడచి వాళ్లతో కలుసుకొన్నారు. అందరూకలిసి రాజు యింటికి చేరుకొన్నారు. పుల్లిగాణ్ణి యింట్లోకి తీపికెళ్ళి నిలబెట్టారు. ఆ యిల్లంతా జనంతో క్రిక్కిరిసిపోయింది. "తాతా? వీణ్ణేం చేద్దాం" అన్నాడు రాజు. తాత మాట్లాడలేదు. బదులుగా రాందాసుగొంతు విప్పి వురి దీసెయ్యమన్నాడు. దాన్నే వీసోబ్ బలపర్చాడు. అందరూ అవునంటేఅవునని తలాఒకటెన్నూ తన్నబోయారు.

"సంపేవాణ్ణి యింకా కొడతం దేనికి" అని రమణమ్మ తీర్పిచ్చింది. దాంతో ఎవరికివారే ఆగిపోయారు.

కోటయ్యా అప్పటికీ ఏమీ మాట్లాడలేదు.

మౌనం అర్ధాంగీకారమన్నట్లు దూలానికి చాంతాడు బిగించి, వుచ్చుబోసి, దాన్ని పుల్లిగాడిమెడకు తగిలించారు.

పుల్లిగాడు వాడిపోయాడు. నిలువెల్లా ముచ్చెమటలు పోసి వణికిపోతున్నాడు. వాడి కిరుప్రక్కలా రాందాసూ ఏసోబులు నిలబడి పెద్దవాళ్ళ ఆనతికోసం ఎదురు చూస్తున్నారు.

"రాజు బాబూ! నన్నొదిలి పెట్టండి. పుణ్యముంటుంది. నే సింకే మార్కెప్పనీ సెయ్యను; మీ పాదాలాన," అంటూ కళ్ళవెంట బొలబొలా నీళ్ళు కార్చాడు. అది చూచేసరికి రాజు గుండె ద్రవించింది.

"ఇంతకూ కోటయ్య తాతా! నువ్వేం మాట్లాడవేం. నీ సలహాకోసం ఎదురుచూస్తున్నాం" అన్నాడు రాజు.

"నా సలహా పెకారమయితే ఆ పని నాకూల్ని యిడిసి పెట్టండి. ఏడుత్తున్నాడుగా! ఇక బాగయి పోతాడులే బాబూ" అన్నాడు కోటయ్యతాత.

"సరే. రాందాసూ! కట్లు విప్పండి" అన్నాడు రాజు.

రాందాసు కట్లు వూడదీసివాణ్ని ఒకతన్ను తన్నాడు. వాడు జనంమీదుగా తూలుతూ వాకిట్లోకొచ్చి పడ్డాడు. అప్పటికే పెద్దరణగొణధ్వనిచేస్తూ కేకలు బొబ్బ

లతో ఒక గుంపువచ్చి పడుతోంది. ఓంకారయ్య, ప్రెసిడెంటు పరంధామయ్యదానికి నాయకత్వం వహించారు. వాళ్ళను చూచాడో లేదో పుల్లిగాడు పరమానందంతో ఒక్క పరుగున వాళ్ళల్లోకి వెళ్ళిపడ్డాడు.

"దొరా! ఆ నాయాళ్ళు నన్ను వురితీత్తానికి తలపడ్డారు! తమురొత్తంసూసి దడిసివొదలిపెట్టేరు" అంటూ మీసం తిప్పాడు.

"అరె నాకొడకా, నీ రోజు మంచిదైంది పో! శూశావా! కోటయ్యా! నువ్వేటో అన్నావు – జుట్టుజారాక ఆ నాయాలెట్టా తిరగబడ్డాడో మళ్ళీ" అన్నాడు పీసోబ్ పళ్ళు పటపటా కొరుకుతూ.

"ఒరే పుల్లిగా! ఇప్పుడూ తప్పించుకొన్నావని మిడిసి పడకు. నువ్వెక్కడ వున్నా నీ స్థానాన్ని గుర్తించుకో" అన్నాడు రాజు.

"వాడి స్థానాన్ని నువ్వేం ఎంచక్కర్లేదు. నీ స్థానం నువ్వెంచుకొంటే చాలు" అంటూ ఓంకారయ్య కావాలని కలిపించుకొని....

"అయ్యా! తమరిలా వూరేగుతున్నారేం జనంతో. ఏసన్నా వుత్సవం జరుపుకొంటున్నారా?" అన్నాడు హేళనగా ....

"క్షణంలో తప్పిపోయింది. ఏదైందీ తెలిసేది ...

"ఓహో! తమరు మాపై దండెత్తి వచ్చారన్న మాట" అని ఓంకారయ్య లాల్చీ జేబునుంచి పిస్తోలు తీసి

రెండు సాగ్లు పైకిపేల్చాడు. ఆ మోతకు ఎక్కడివాళ్లక్కడ జడిసి పరుగు లెత్తారు.

"పిరికి వెధవలు పారిపోయారు" అంటూ సగర్వంగా వెనక్కి తిరిగేసరికి తన వెంట వచ్చిన వాళ్ళల్లో ఒక్క పిట్ట కూడా అక్కడ కనిపించ లేదు.

దాంతో పిరికి దోచింది. ఆందోళన పడ్డాడు.

గభాలున రాజు బైటకొచ్చి "పట్టుకోండి" అంటూ అరచాడు. వెంటనే నలు వేపుల్నించీ జనం కమ్ముకు రాబో తున్నారు.

గభాలున పిస్తోల్లో తూటా లమర్చుకొని, కమ్ముకు వస్తున్న జనంవేపు గురిపెట్టి చూపుతూ అదే పనిగా పరుగా లంకించుకొన్నాడు ఓంకారయ్య.

# 16

ఊరి మూల వెదురు గుమ్ముల దగ్గర కెళ్ళి నీడన కూర్చున్నాడు రాజు. ఇదే చోటకు రమ్మనమని లలితకు నిన్ననే లచ్చువమ్మ ద్వారా కబురంపించాడు. ఆమె రాక కొరకు చాలా సేపట్నుంచి నిరీక్షిస్తున్నాడు. ఆమెతో మాట్లాడ వలసిన సంగతులెన్నో వున్నాయి. తనవాళ్ళు పసి పాటా లేక పచ్చి మంచినీళ్ళు అంగిట్లో పోసుకొని ప్రాణం నిలుపు కొంటున్నారు. కొందరు నిలువలేక పొరుగూళ్ళకు వలస బోతున్నారు. కొందరు పళ్ళ బిగువున యిక్కడేవుండి

దిన దినం తమ భవిష్యత్తుకోసం ఎదురు చూస్తూ వున్నారు. ఊడ్పులు పోయి కలుపు లొచ్చాయంటే అందుకు తమ నెవ్వరూ పిలువలేదు. దానికి కూడా పొరుగూళ్ళ వాళ్ళనే రప్పించుకొని మువ్వావలా,పద్నాలుగణాల చొప్పున ఇచ్చే దినవారీ బత్తెం కూడా ఏర్పాటు చేశారు.

వెనకైతే తిరుగుబాటు లేవదీశాడు గాని, ఇప్పుడంత వరకూ పోదలుచుకోలేదు. రాజు చెవిటి ముందు శంఖం వూదినట్లే వాళ్ళముందెంత వాగినా ప్రయోజకత్వం లేదను కొన్నాడు రాజు. ఐదు వందల రూపాయలు ఫీజు ధనం క్రింద లేబర్ సంఘం రిజిష్టరు చేయించుకుంటే, ఆ ఒక్క పనీ తప్పించి మరో చిన్న మెత్తు పనికూడా చూపించలేదు. సమితివాళ్ళు ఎప్పుడో క్వారీ పనులు వస్తే వాటికోసం కాచుకు కూర్చోమంటే అవి వచ్చు; వచ్చును. అందాకా బ్రతికే దెవరు? ఇప్పుడే జనం మల మల మాడిపోతున్నారే!

రాజు కెటూ పాలు పోకుండా వుంది. దీర్ఘాలోచనా నిమగ్నుడై ఉండగా లలిత చిరునవ్వు లొలికిస్తూ తనముందు సాక్షాత్కరించింది.

"చాలా సేపయ్యిందేమో మీరొచ్చి ?" అంటూ అక్కడే చతికిల బడింది.

"ఎంతసేపైతేనేం గాని,ముందు మీ ఆరోగ్య మెలా గుందో చెప్పండి."

"మీలాగే ! అనేసరికి రాజు తన్ను తాను పరకా యించి చూచుకొని నఖశిఖ పర్యంతం ఆమె నవలోకిం చాడు. ఆమె అన్నది నిజమే ననుకున్నాడు. పైవెచ్చ

బుగ్గలవీ పూడి వెనకటికన్నా కాస్త పుష్టిగానే వుందని చెప్పకోవచ్చు. ఆమెకు ఆ నాడు దెబ్బ తగిలిన తర్వాత ఆమె ఎంతో క్రుంగి కృశించి వుంటుందనుకున్నాడు. కాని ఆమె పుష్టిగానే ఉంది. ఆమె కోలుకున్న తర్వాత ఇదే తిరిగి కలుసుకోవటం.

"నా గూర్చి చాలా త్యాగం చేశారు. స్త్రీగా ఎవ్వరూ చెయ్యలేనిది..." అన్నాడు.

ప్రతిగా ఆమె చిరునవ్వు నవ్వి వూరుకొంది.

"ఏమిటలా నవ్వుతారు. మీరు చేసింది త్యాగం కాదంటారా ?"

"ఏమో నాకు తెలీదు. స్త్రీగా ప్రతి ఒక్కరూ చేయువలసిన పనని తెలుసు."

"మీ మూలంగా నా చావు తప్పింది. లేకపోతే మీకు నేను కనిపించక పోదునేమో ?"

"అందుకేగా మిమ్మల్ని రక్షించుకొండి...."

"మీకు చాలా రుణపడ్డాను. మీలాంటి స్త్రీకలెంతమంది ఉంటారంటారు ?

"ఏమో! అంతవరకూ అంచనా వేయలేదు."

యిద్దరి దగ్గరా మాటలైపోయాయి. ఒకరి ముఖం ఒకరు చూచుకొని మౌనంగా ఉండిపోయారు.

"సరే. ఇంతకూ నా కబురు చేసిం దెందుకో__?" అని అడిగింది సౌమ్యంగా.

"నేనూ అదే చెబుదా మనుకొంటున్నాను. మన వాళ్ళకి పనేమీ దొరకడంలేదు. ఆ ముష్టావలా, పద్యాలు గణాలుకూడా పిలిచేవాడులేడు. చాలామంది కొంపొదిలి వలస పోతున్నారు. యిటువంటప్పుడు మనం ఏమీ చెయ్య లేకపోతే ఎలా చెప్పండి!"

"నిజమే! నాకు ఏదీ తోచడంలేదు రాజూ. మా నాన్నకూ, నాకూ యిప్పుడు మాటల్లేవు - ఆయన వితండుడు. వాదించి వాదించి విఫలత చెందాను."

కాదు మన ప్రయత్న మేమిటో కొసకంటా కొనసాగిద్దాం" అంటూ తన చేతిలో ఉన్న పర్సు తెరిచి అందులోంచి నాల్గు పచ్చ-చెక్కలు బైటకు తీసింది.

"వీటని వరీ లేనివాళ్ళకు పంచిపెట్టండి" చెయ్యి చాచి అందించింది.

"మీ ఆజ్ఞ" అంటూ వాటిని జేబులో పెట్టుకొంటూండగా "రాజూ! ఆ డబ్బులో నాకూడా భాగముందా?" అంటూ రమణమ్మ అక్కడకొచ్చి పడింది. రాజు వేపూ, లలిత వేపూ అదోలా చూచింది. వాళ్ళిద్దరూ అలా కూర్చుని ఉండగా తాను బంట్రోతులా నిలబడి ఉండడం సహించలేకపోయింది. ఏదో బాధతోనూ క్రుంగి పోయింది. ఏదో అమూల్యమైన వస్తువును పోగొట్టుకొన్న దానిలా సంక్షోభ పడింది.

"రాజూ నువ్విక్కడ ఊసులాడుతూ కూకుంటే కుదరదు - నీ కోసం ఎవరో వచ్చేరు.

చూ నాన్నా, ఏసోబు. కోటయ్యతాతా అక్కడాయ నతో మాట్లాడుతుంటారు-బొ గా, ఊరంతా తిరిగితేమాత్రం ఎక్కడుంటావ్ దొరవు? - యిద్దె నాకు తెలీదు ఇక్కడుండావని ఎవరో సెపితే వరిగెత్తుకొచ్చా-, ఎన్నోళ్లినుం చేటి? ఈ మకాము?"

ఆ మాట్లాడే తీరుచూచి లలిత నొచ్చుకొంది. రమ ణమ్మ ఏమి వాగుతున్నా రాజు మాట్లాడకపోవడం లలితకు కష్టం కలిగించింది.

"మరి ఆ వచ్చిందెవరో, పనేమిటో చెప్పవే" అని లలిత అందుకొన్నది.

"అడిగినోళ్ళందరికీ చెప్పటానికి నేనేం నౌకర్ని కాదు. సెప్పిచ్చుకోటానికి నువేం దొరసానమ్మవూకాదు" అని చిటపటలాడింది రమణమ్మ.

"అడగటంకూడా తంటానేవుందే?" అనుకొని లలిత మళ్ళీ నోరెత్తలా.

కాని రమణమ్మ అంతటితో వదలిపెట్టేట్లూ కన బడలేదు. ఉన్న అక్కసు కాస్తా వెళ్ళగక్కేద్దామన్నట్లు ధుమధుమలాడుతూ ముఖం చేటంత చేసుకొని లలితకేసి నేరుగానే తిరిగింది. ఏదో కొంప మునిగేటట్లుందని రాజు గ్రహించాడు. అక్కడనుంచి లేచి చరచరా నడవ నారం భించాడు. అతనితోపాటు ఆ యిద్దరూ వెనకా ముందూ బయలుదేరి వస్తున్నారు. తిన్నగా రాజు తన యింటికొచ్చే సరికే అక్కడో నలభై, యాభై మంది ఆయనకోసం ఎదురు చూస్తూ నిలబడి ఉన్నారు.

"బాబా - యింతసేపు ఏడకెళ్లేరు" అని ఆళ్ళలో ఉన్న కోటయ్యతాత అడిగాడు.

"ఎక్కడికీలేదు-" అన్నాడు.

"అంతా అబద్ధం. ఆ యమ్మతో ఎదురు గుమ్మల సాటున రాసికమాడుతుండాడు-" అంది రమణమ్మ.

అక్కడే ఉన్న లలిత ముఖం చిన్నబోయి అరకాసం తయింది.

రాజు ముఖకవళికల్లో బయటకేమీ కనబడక పోయినా లోలోనమాత్రం మధనపడుతూనే ఉన్నాడు.

కోటయ్యతాత అది కనిపెట్టి 'నోరుముయ్' అని రమణమ్మను గద్దించాడు.

"రాజు బాబూ ఈయన రయిల్వేపని చేస్తుంటారు. వాళ్ళు కొత్త లయినొకటి ఏత్తుండాగంట. కూలీల్ని అగావుగా తీసుకెళ్లాలని వొచ్చాడు - ఆడా, మొగా లేకుండా అందరికీ రూపాయిన్నర యిత్తారంట - తమరేమంటారు" అన్నాడు కోటయ్య ప్రక్కనే ఉన్న రైల్వే ఉద్యోగిని చూపిస్తూ—

"అదృష్టం! ఇంకా మన క్కావలసిందేముంది" అంటూ ఆ ఉద్యోగివేపు చూచి ఐతే ఎంతమంది కావాలండి?" అని అడిగాడు రాజు.

"మీ రెంతమందినైనా తీసుకురండి — అందర్నీ భరించగలం."

"మరెప్పుడు పనిలో ప్రవేశించమంటారు" లలిత అందుకొని అడిగింది.

"రేపే! మీరు వస్తేసరి! లేకపోతే మరొకళ్ళకోసం పరుగెత్తాలి."

"అబ్బే! తప్పకుండా వొత్తామండి!" అని యింత వరకూ అద్దినబొమ్మలల్లే నిలబడివున్న ఏసోబూ, రాందాసూ అందుకొన్నారు.

"మరి మీ సంగతి? మీరు మాప్రక్కనే వుండాలి" అన్నాడు రాజు లలితతో.

అదేమాట తన్నడగలేదామా యని రమణమ్మ రాజువేపు కొరకొరలాడుతూ చూచింది.

"తప్పకుండా. మీరు కోరడమూ, నేను కాదనడమూనా? మీతోపాటు పనిచెయ్యాలని నాకూ అభిలాషగానే ఉంది" అని లలిత అందుకొంది.

"ఏమయ్యా! రేపు మీరంతా సిద్ధమేగా? అని రాజు అందరినీ ఒకసారి కలయజూశాడు. సిద్ధమే నన్నట్లు అందరూ తలలూపారు.

పని జోరుగా సాగిపోతోంది. ఆడ - మగ అందరకీ రోజుకి రూపాయిన్నర, రూపాయిపావలా చొప్పున పడుతున్నది. ఐనా నిస్పృహ చెందకుండా సంతృప్తితో పని చేసుకుపోతున్నారు.

"హేలీలోం, హేలీలోం హైలేస" అంటూ కొందరు మీటరుగేజి పట్టాలు వూడబెరుకుతుంటే "జైంభై రే జారు లంగరు" అని మరి కొందరు కరవళ్ళు తోలుతూ వాటి స్థానంలో బ్రాడ్‌గేజి పట్టాలు మార్చుకుంటూ వస్తున్నారు.

వీళ్ళ కవతలగా కొందరు చిన్న చిన్న బ్రిడ్జీలు కగలగొడు తున్నారు. మరికొందరు కొత్త కట్టడాలు నిర్మిస్తున్నారు.

కొందరు వీళ్ళెవ్వరితోనూ పొత్తు లేకుండా నెత్తిన తట్ట పెట్టుకొని అల్లంత దూరంలో మట్టి తవ్వి రైలు కట్ట కిరుపక్కలా భరంతు పోస్తున్నారు. మొత్తంమీద అన్ని జట్టీలూ శ్రమను సమంగానే పంచుకొంటున్నారు. ఎటుతిరిగీ రాజుమాట్టుకు అంతగా చెయ్యలేక పోతున్నా మధ్య మధ్య 'సాలి తీర్చుకొంటూ అలాగే బండి లాగుతున్నాడు. కాని ఎలువూ సుళువుల్ని మాత్రం అందరికీ నూరిపోస్తున్నాడు. ఎవరికి వాళ్ళు తట్టలతో మోసేకంటే ఒకరి పక్కన ఒకరు నుంచుని అందించుకోటం మంచిదనుకున్నారు. యెన్నడూ పనిముఖం యెరగని లలితకూ వీళ్ళతోపాటు పని చేస్తూనే ఉంది. చీర యెగ్గట్టి గోచీపెట్టి చెంగు చెంగున యెగు రుతూ తట్టలు ఒకళ్ళ కందించకుండా తానే వెళ్ళి పోసి వస్తూంది. ఆమె అలా వెళుతుంటే తనేనా అంత తక్కువ తిన్నదని రమణమ్మకూడా వరుసలోంచి వైదొలగి ఆవిడతో పోటీపడి చలాకీగా పరుగులెత్తుతోంది.

"ఫర్వాలేదు! మీా యిద్దరికీ సరిపోయింది!" అంటు న్నాడు రాజు. వాళ్ళ వైరానికి నవ్వుకుంటూ.

"ఏం" అంటూ అందుకొంది లలిత—

"ఏముంది? అంత ఒళ్ళు విరుచుకోకపోతే ఆ వరుస లోనే నుంచోకూడదూ? కొత్త బిచ్చగాడు పొద్దెరుగం డన్నట్లుంది మీా వరస—"

"నా కలవా టేలే రాజూ" అంది రమణమ్మ మొన విరుపుగా—

"నీలాం అందరూ చెయ్యలేరుగా—సరే. లలితా! మీరు వరుసలోకి రండి. నే అందిస్తా" అంటూ రాజు ఆ కొకన్నా ముందే వెళ్ళి వరుసలో నిలబడ్డాడు. ఆ వెనుక లలితకూడా వచ్చి వరుసలో నిలబడింది. రాజు తన చేతుల మీదుగా ప్రక్కనున్న లలితకు మట్టితట్ట అందిస్తూ ఉంటే ఆమె బరువు భారం మరచి హుషారుగా ప్రక్క వారి కందిస్తూ ఉంది

ఒంటరిగా మోస్తున్న రమణమ్మ ఇదిచూచి అసూయ పడింది. తను మోస్తూ ఉండగా రాజు చూస్తూ ఆనంద పడాలని ఆమె ఉద్దేశం, కానీ తను మోస్తున్నది యిప్పు డెవరు చూస్తారు? ఆ చూపులు, ఆ చేష్టలు అన్నీ ప్రక్కనున్న ఆపడమీద నేనయ్యే, అలాంటప్పుడు తన పనితనం, తన నడక, చూడాలని అతనికేం పట్టింది.

రమణమ్మ ఆవేశపడింది ఉద్రేకంతో ఒళ్ళు కంపిం చింది. కోపంతో ముఖం జేవురించింది. ముక్కు పుటాలు లేచి పడ్డాయి. నెత్తిపైనున్న తట్టెడుమన్నూ అమాంతం క్రింద దిమ్మరించింది. చరచరా రాజూ లలితల మధ్యకు వెళ్ళి ఖాళీచేసుకొని నిలబడింది.

"రమణీ! ఏమిటి పెంకితనం!" అంటూ అందించ బోయిన తట్ట నాపాడు రాజు. ఈ ఒక్కదాని మూలంగా అందరపనీ ఆగినట్లయింది.

"పెంకితనమేటి రాజు. నేనూనుంచొంటా. నాకేనా అంత పరిగెత్తి యెయ్యాలని హుషారు ?" అంది ప్రక్కనే ఉన్న లలితను కాస్త ఆచంటికి భుజంతో తోస్తూ.

"నన్ను నిలబడవదంటావా చెప్పమ్మాయ్. ఎందుకలా నెట్టుతావ్ భుజంతో. బాగా బలముందనా ? నాకూ ఉందామాత్రం బలం" అంటూ రమణమ్మను కాస్త అటు నెట్టింది.

రమణమ్మేనా తక్కువ తిన్నది ! చూడండి నా ప్రతాప మన్నట్లు మొరటుగా ఆమెను ఢీకొంది. యిద్దరూ చేతులు కలుపుకున్నారు. ప్రక్కనున్న జనమంతా పని ఆపి వినోద్యం చూస్తున్నారు.

"ఛీ ఛీ" అంటూ రాజు అసహ్యించుకొని లైను వదలి యివతలకొచ్చాడు.

"లలితా ! ఏమిటది ? ఒకళ్ళకు కాకపోయినా ఒకళ్ళకైనా తెలియొద్దూ? పని చూడండి! యెంత కుంపయిపోతుందో మీ మూలంగా !" అంటూ ఎవరిపని వాళ్ళు చేసుకు పొమ్మని అందరినీ ఆదేశించాడు. వెంటనే బెలబెలమంటూ అందరూ వరుస త్రెంచుకొని యెవరికి వారే యమునాతీరేగా పని చేయుటం మొదలుపెట్టారు.

"రాజూ ! నే వెళతాను. నేను మీతో వుండి పని చెయ్యడం రమణికి గిట్టనట్టుంది—" అంది లలిత.

"నేనే యెళ్తాను. మీ యిద్దరే చేసుకోండి—" అంది రమణి.

మళ్ళీ పోటాపోటీతో రాజు తల తిరిగిపోయింది. వీళ్ళకీచులాటకు సమయం సందర్భం లేకపోవడం చిత్రంగా తోచింది. వాళ్ళ కడుపుల్లోవున్న కలతేమిటో తనకు బోధపడడంలేదు. యిందులో ఏ ఒక్కర్ని గద్దించడానికీ తనకు అధికారం లేదు.

"దయచేసి మీా యిద్దరూ వెళ్ళండి. అప్పుడైనా మా పని సక్రమంగా సాగిపోతుందేమో" అన్నాడు వినమ్రుడై.

"నే నొచ్చింది. పని చేసుకొంటానిగ్గాని - నీతో యెల్లమనిపించుకోటానికి కాదు. రాజూ - అట్టా ఎల్లమనే అధికారం నీకు లేదు" అంది రమణమ్మ.

తక్కున రాజునోటికి తాళంపడింది "గద్దు దిక్కే వచ్చిందే' అని తెల్లమొహంవేశాడు.

ఇంతలో పట్టాలమర్చే పనిలోవున్న రాందాసు, కూతురి చేష్టలు చూచి కసకసలాడుదూ అక్కడి కొచ్చాడు.

"రమణీ! నువ్వు మనిషివా పశువువా! ఇది పని అను కొన్నావా ఆటనుకొన్నావా? అంటూ ఒకకుమచ్చున తిట్టి పోశాడు రమణమ్మ కుక్కినపేనల్లే తలవంచుకొని నిల బడింది.

"సూడుండమ్మా, అదొట్టి మొరటుముండ. తవురేం లక్షెపెట్టుకోకండి- నామాటిని తమపని చేసుకుపొండి. రాజు బాబు దగ్గరనుంచుని పని ఎట్టాచెయ్యాలో ఆళ్ళకి చెప్పండి"

అంటూ వెళ్ళబోయాడు. అంతలోకే లైన్ ఇన్‌స్పెక్టరు ట్రాలీ దిగి అక్కడికొచ్చాడు. తలపైవున్న హేట్ సరిచేసుకొంటూ క్షణకాలం అందరికేసీ దృష్టి పోనిచ్చాడు - కళ్ళద్దాలు తీసి చేతిలో షోకుగా దిప్పుకుంటూ లలితకేసి ఓరగా చూశాడు. ఆ చూపుకు లలితఒళ్ళు మండింది. "వెధవ చూపు!" అని ముఖం పక్కకు త్రిప్పుకొంది. పక్కనున్న వాళ్ళమీద పెట్టి నాలుగు చడామడా తిడదామనుకొంది గాని ఎందుకులెమ్మని ఆగిపోయింది.

"మీరంతా సుకుమారుల్లాగా వున్నారే" అన్నాడు ఆఫీసరు.

ఠక్కున లలిత ఆతనివేపు కొర్రునచూచి రాజుదగ్గరకు వచ్చేసింది.

"లేదండీ! అంతా చెమటోడ్చి కష్టపడేవాళ్ళమే!" అన్నాడు రాజు.

"కనబడుతూనే వుంది మీ వాలకం"

"అంటే? ఏమిటి?" అన్నాడు రాజు కాస్త ఘాటుగా.

"ఏం లేదు. మీ వల్ల మా పని జరిగేట్లు కన్పడ్డంలా, మీరు యిళ్ళకెళ్ళిపోండి!" అంటూ అవతలివాళ్ళు చెప్పేది వినిపించుకోకుండా చరచరా వెళ్ళిపోయాడు. ఇంతలో ఏ సోబుకూడా ఓనలభైమందిని వెంట బెట్టుకొని అక్కడ కొచ్చాడు.

"ఏం ఏసోబ్! ఇటు వచ్చారు?" అన్నాడు రాజు.

"బాబూ మమ్మల్ని పని సేతకాదని ఎల్లిపొమ్మన్నాడా ఎద....

"ఇష్!" అంటూ మూతిమీద వ్రేలేసుకొన్నాడు రాజు.

"ఇందులో సాటేటిబాబూ - అంతకాబట్టనోడు ఎందుకు పిలవాలి .." అంటూ ఇంకేదో అనబోతుండగా మధ్యలో రాందాసు అడ్డంవచ్చి రాజును తట్టాడు.

"బాబూ అటు ట్రాలీకేసి సూడుండి" అంటూ చెయ్యెత్తి చూపించాడు రాజు. అప్రయత్నంగానే అటు తిరిగాడు. ట్రాలీమీద ఇన్స్పెక్టర్ ప్రక్కనే ఆనుకొని ఓంకారయ్య తీవిగా మీసందువ్వుతూ యిటుకేసి చూస్తున్నాడు

"అదా సంగతి!" అంటూ పళ్ళు కొరికాడు రాజు.

"బాబూ! ఆడే ఈ యెత్తుమానం చేస్తుంటాడు - అన్నాడు రాందాసు.

"ఔనౌను" అంటూ రాజు లలితకేసి చూచాడు.

"చూశావా లలితా మీ నాన్న ఎంతవరకొచ్చాడో!" అన్నాడు - అటువంటి మనిషే! వట్టి నీచుడు అంటూ లలితకోపాన్ని దిగమింగుకొంది.

"సరే ఇక నడవండి యింటికి?" అంటూ రాజు రమణమ్మకేసి మిరిమిరిచూస్తూ యింటిముఖం పట్టాడు. అంతా ఒకరు తర్వాత ఓళ్ళు బరువెక్కిన కాళ్ళను యీడ్చుకొంటూ నెమ్మదిగా ఇళ్ళకెళ్ళిపోయారు.

# 17

"ఆ బ్రతుకుకూడా బ్రతకనిచ్చేట్టులేరు. వినాశ కాలే విపరీతబుద్ధి" అంది భర్త వెలుపలనుంచి యింట్లోకి వచ్చిరావడంతోనే చంద్రమతి.

"ఏమిటే ఆ కూతలు" అంటూ ప్రక్కనే కూర్చుని వున్న కూతురు లలితను చూసి ముఖం చింపరించుకున్నాడు.

"వంగ నాచిలా మాట్లాడుతున్నారే! పాపం ఏమీ ఎరుగరు. చేసేచేసే పనివాళ్ళను ఆ పనిలోనుంచి వెళ్ళగొట్టించడం దేనికి?"

"నే సేపనివాళ్ళను వెళ్ళగొట్టించానే?" అంటూ ఒట్టి అమాయకంగా అడిగాడు.

"ఏ పనివాళ్ళనా? అంత తెలీక మాట్లాడుతున్నారా, మనం పిలువకపోగా దొరికిన ఆ రైల్వేపని కూడా వాళ్ళకి దక్కనీకుండా చేశారే! పాపం వాళ్ళేదో కష్టపడి చేసుకొంటూంటే ఇన్‌స్పెక్టర్‌కు చెప్పి వాళ్ళను వెళ్ళగొట్టించాల్సినంత కర్మమీకేంవచ్చింది! వాళ్ళమీద మీ కంత కసి ఎందుకు? వాళ్ళు మీ పనులకేమన్నా అడ్డంవచ్చారా? వాళ్ళను కాదని పొరుగూరినుంచి కూలోళ్ళను రప్పించుకొన్నారాయె! వీళ్ళజోలి మీకెందుకు అని చంద్రమతి ప్రశ్నలవర్షం కురిపించి భర్తను ఊపిరాడనివ్వకుండా నిలవేసింది.

"నేను వెళ్ళగొట్టానని అమ్మాయిగారు తెలియ జేశారా?"

"లోకం కోడై కూస్తోంది. ఒక్క అమ్మాయే కాదు. ఏ నోటవిన్నా చిలవలుపలవలుచేసి చెప్పుకొంటున్నారు."

"మరేం ఫర్వాలేదు. నాకంఠంలో వూపిరుండగా వాళ్ళను వుత్తనే వదలిపెట్టను. వాళ్ళకి పచ్చిమంచినీళ్ళు కూడా పుట్టకుండా చేస్తాను"

"చేద్దురుగాని లే! తొందర పడకండి. గాలిలో దీపం పెడితే తట్టుకోలేక ఆరిపోతుంది. అదే అగ్ని గోళమై పొగల తోనూ, సెగలతోనూ వెలుగుతున్నప్పుడు అడ్డు వచ్చిన ప్రతిదాన్ని దహించి వేస్తుంది! అప్పుడు పరమ శత్రువైన ఆగాలే దానికి మిత్ర మౌతుంది"అన్నది లలిత వున్నట్టుండి.

ఆ మాటల అంతరార్థ మేమిటో ఓంకారయ్య గ్రహించలేక పోయాడు. కన్న కూతురులో యింత ఆడం బరం పెచ్చు పోతోందేమిటా అని మాత్రం ఆలోచించ సాగాడు. క్షణంలో అతని కళ్ళు ఎర్రబడ్డాయి. ముఖం వికృత రూపం దాల్చి కందగడ్డలా తయారైంది.

"హద్దు మీరి మాట్లాడుతున్నావ్ ! జాగ్రత్త ! ! తండ్రిని కాదని అలగా వెధవలతో కలసి పనిచేస్తావ్ ? నీకు సిగ్గూ ఎగ్గూ, చీమూ నెత్తురూ వుంటే అలా వెళతావా ?

"ఏమండి చేస్తే? అమ్మాయి కలా చేయడం ఇష్ట మైంది, చేస్తూంది"

"రేపు నువ్వూ వెళ్ళి చేస్తానంటావు. అందరూ ఒక్కసారి దొమ్మరాళ్ళలా కలిసిపోండి పీడా వొదలి పోతుంది."

"అన్నంతా అయితే గాని తెలిసి రాదా!" అంది చంద్రమతి.

దాంతో ఓంకారయ్య కోపం విజృంభించింది. తన భార్య తెగబడి అడ్డు చెప్పడం యిదే మొదలు. ఒళ్ళు మండి పోయింది. ఒక్కసారిగా భార్యపై విరుచుకు పడ్డాడు. "ఏమన్నావు"— అంటూ జుట్టుపట్టి కుదిపి అలా విసిరిపారేశాడు ఆమె ఆ విసురు కాగలేక కుప్పలా కూలిపోయింది.

"చంపండి! కింద పడేసి నిలబడ్డారే!! మీదపడి తొక్కి చంపండి. నాతో పాటు దీన్నికూడా చంపేసెయ్యండి ఒక్కడివే పుట్టికట్టుకొని వేళ్ళాడొచ్చు-" అంది క్రిందపడి రెచ్చిపోయిన కోపంతో లేవబోతూ

"మొండిదానివి నోరికావ్! కొట్టినా కోసినా లాభం లేదు-"అంటూ వెనక్కి తిరిగాడో లేదో ఇంతలో హఠాత్తుగా కరణం కరోరశాస్త్రి "శరణు శరణంటూ" వచ్చి ఓంకారయ్యను లుంగ వేసుకొన్నాడు. అతని నెత్తి చిల్లుపడి కణతలమీది నుంచి బుగ్గలమీదుగా నెత్తురు దోనవడి కారుతోంది. ఓంకారయ్య కంగారు పడ్డా ఏమిటని అడిగే సావకాశం అయినా లేకుండా పుల్లిగాడు లచ్చుచమ్మ కొప్పు

పట్టుకొని బడబడా యీడ్చుకొంటూ అక్కడికొచ్చాడు. అలా లాక్కొస్తుంటే అది కుయి కుయి మనడం లేదు.

"ఏవిట్రా పుల్లీ, దాని కొప్పు విడవరా! పూడి పోయేట్టు పట్టుకొన్నావ్" అన్నాడు ఓంకారయ్య. "దొరా, ఇది చెడు ముండయిపోయింది. పట్టపగలే ఆ నాయాలుతో వసాట్టో కులుకుతుండాది" అంటూ దాన్ని వదలి ఓంకారయ్య దగ్గరున్న కఠోర శాస్త్రిమీదకి ఉరకబోయాడు.

"ఆగరా! ఇంత రౌద్రం దేనికిరా, ఇంతలోనే కొట్టాలట్రా? చూడు. ఇతనికి నెత్తురెలా కారుతోందో? అన్నాడు.

"కొట్టాలా కట్టెయ్యాలా! ఆ దేవుడు! అదెవుతి? దాని జోలి కెళ్లొద్దంటే నా కల్లముందే- తూత్ —" అంటూ మళ్ళీ మీద కెళ్ళబోయాడు. ఓంకారయ్య వాణ్ణి వెనక్కి నెట్టాడు.

"నే సెట్టా స ఆడికేటి దొరా. పూరికే మీ క కొచ్చి కొడుతుండాడు ?" అంది లచ్చువమ్మ అందుకుని.

"ఈ యింటో ఇట్లాటియి సాగుతుంటే తప్పురెట్టా వూరుకుంటారు. చెప్పండి దొరా మాలాక్కి కట్టెయ్యండి. బోయికి లేకగ బాడుత్తా" అన్నాడు.

ఓంకారయ్య ఆలోచనలో పడ్డాడు కరణం కఠోర శాస్త్రి తన కన్ని విధాలా సహాయకారి అయున్న ఏమనడానికీ వీల్లేదు. అట్లని పుల్లిగాడి మాటా తోసెయ్యకూడదు. ఈ యింటిలో యిలాంటి అగడాలు జరుగుతుంటే లోకులకు తనే పలచనవూతాడు. పోనీ లచ్చువమ్మను గద్దించి

పొమ్మందామంటే, యింటి పనంతా నమ్మకంగా అదొక్కత్తే యీడ్చుకొస్తూ వుంది. ఇంతకూ యీ అల్లరంతా పుల్లిగాడే చేసుకొస్తున్నాడని తనకి తెలుసు. లేకపోతే దీన్ని కఠోరశాస్త్రిని కొట్టవలసిన పని వాడికేముంది; వాడికి దీని మీద కన్ను పడింది. కాని వాడి ఆటలు దానిముందు సాగడం లేదు. అదీ వాడి వుక్రోషమల్లా.

"పుల్లీ! దాన్నలా ఈడ్చుకురావడానికే మధికారముందిరా!" అన్నాడు—

"తీక్వరీ!" అనుకొంది చంద్రమతి కసిగా.

"అదా! నా కాబోయే పెళ్లాం—"

"ఛీ పో" అంది లచ్చువుమ్మ ముఖం చిట్లించి—

"దానికిష్టం లేనప్పుడు నీ పెండ్లామెట్లా అవుతుందిరా. అటువంటి ఆశ మానుకో. వాళ్ళిలా క్రిందా మీదా పడితే నీకెందుకు! ఏమయ్యోయ్ కఠోరశాస్త్రి! నువ్వు కూడా వెళ్ళు. ఈ ఆవరణలో వుండగా దానితో నువ్వేం మాట్లాడవద్దు" అన్నాడు ఓంకారయ్య

పుల్లిగాడు ఎగిరెగిరిపడుతూ వెళ్ళిపోయాడు. ఇప్పుడప్పుడే పంపించడం మంచిది కాదని శాస్త్రిని తన గదిలోకి తీసుకొని వెళ్ళాడు ఓంకారయ్య. ఏమీ స్పర్థ లేనట్లు భార్యను పిలచి కాస్త ఐడిన్ తెచ్చి ఈయన నెత్తిన తగలెయ్యమన్నాడు. "వేసుకో" అంటూ చంద్రమతీ, లలితా కిందకెళ్ళిపోయారు. లచ్చువుమ్మను వెయ్యమంటే 'నాకేటి సంబంధం' అని అదీ వెళ్ళిపోయింది. ఓంకారయ్య పళ్ళు పటపటా కొరికి తనే ఆ పని కాస్తా చేసి ఆయన్ని నెమ్మదిగా

సాగనంపి తిరిగివచ్చేసరికి పుల్లి. మాట్లాడుతున్నాడు. ప్రక్కనే లచ్చువమ్మకూడా నిలబడివుంది. ఏమిటో విందామని గోడపక్కకుజరిగి చెవినిక్కబెట్టి వింటున్నాడు.

"లచ్చీ! నీకా కోతిమూతి తప్పించి పుల్లిగాడు నచ్చలేదటే" అన్నది చంద్రమ్మ గొంతు—

"ఆ మాట నేనన్లేదమ్మగోరూ. ఆడే పతిరంకు కడుతుండా మాటెయ్యిలా?" అన్నది లచ్చువమ్మగొంతు—

"ఏంరా! మరి నువ్విట్లా కొట్టుకొంటున్నావ్?"

"ఇది ఒట్టికిలాడమ్మగోరు. తమవొద్ద అట్టనే అంటది."

"ఏం లచ్చీ! నిజంమేనా?"

"వుట్టిదమ్మ. పుల్లిగాడు నాయెన కాడితే - ఏదో తప్పు చేస్తుంటానని పడతాడుగాని, ఎప్పుడూ నోరుజారి అడగలా."

"ఏంరా?"

"నిజమే కాదమ్మగోరు; ఎట్టా అడగాల్నో తెలవలా."

"అంతా నీదగ్గరే వుందన్నమాట. ఏమే లచ్చీ నీకు పుల్లిగాడంటే యిష్టమేనన్నమాట!"

"అదేమాట పుల్లినికూడా అడగండి!" అంటూ చెంతనేవున్న పుల్లిగాడి డొక్కలో యీచీత్తో పొడిచి ఒక్క గంతేసి బయటకు పరుగుతీసింది పుల్లిగాడు ఎగిరిపడి వెంట

బడ్డాడు. ఇంతవరకూ దాగివున్న ఓంకారయ్య గబగబా లోనికివెళ్ళి "అన్నిటికీ తగిపోయారు!" అన్నాడు వుక్రోషంతో—

"దొమ్మరివాళ్ళకు ఆ మాత్రం లేకపోతే ఎట్లా?" అంది చంద్రమతి.

ఓకాంరయ్య మారుమాట్లాడకుండా బుసలుకొట్టాడు.

# 19

కోతలు కోశారు. కుప్పలువేశారు కానీ కొండాసూ వాళ్ళుమాత్రం పని దొరక్క అల్లాడిపోతున్నారు. ఇప్పటికే కొంతమందివలస పోయారు. ఉన్నవాళ్ళు వూపిరి బిగబట్టి పళ్ళబిగువున నిలబడ్డారు. ఐనా వాళ్ళలో సత్తువలేదు. ఒట్టి అస్థిపంజరాలై వున్నారు. వాళ్ళను చూస్తూంటే ప్రాణం తరుక్కుపోయేస్థితి కొచ్చారు. ఎంత పంతంపట్టి నిలబడినా రైతులు కన్నెత్తిచూడ్డంలేదు. ఎందుకు చూస్తారు? కోతలూకుప్పలుకూడా పొరుగూరిజనాన్నిరప్పించి వేయించుకొన్నారు. రేపో మాపో కుప్పలు దించి మార్చడానికికూడా ఆ జనాన్నే అట్టిపెట్టుకున్నారు. పొట్టకొరకు దేవుళ్లాడే తమలోనే యింత ఐక్యతలేనప్పుడు ఎవరేం జెయ్యగలరు? వాళ్ళకెంత బోధించినా వదిలిపెట్టి వెళ్ళలేదు. పైపెచ్చు వాళ్ళు శాశ్వతంగా యిక్కడే వుండి పోయేదానికోసమని ఓంకా

గయ్యి ఇళ్ళూ - వాకిళ్ళూ ఏర్పాటు చేస్తున్నట్లు వినికి డయ్యింది. ఇలాంటి అరాచకం ఎంతకాలం కొనసాగిస్తాడో! ఆఖరికి తను ఆడమన్నట్లల్లా ఆడిన పుల్లిగాడికికూడా బాగా బుద్ధి చెప్పాడు. వాడీమధ్య లచ్చువమ్మని చక్కేసి పెళ్ళి చేసుకుని కాపురం పెట్టాడు. ఓంకారయ్య చావట్లోనే ఓమూల దడికట్టుకొని సంసారం సాగిస్తున్నాడు. ఒంటిగా వున్నప్పుడు ఏదు ఎగిరిపడ్డా, జోడు వచ్చేసరికి కొత్తకాప రానికి కావలసిన సరంజామా ఏర్పాటు చేసుకోడం తలకు మించినదైంది పుల్లిగాడికి.

ఒకనాడు "ఇవ్వాళ పొందిమీది పిల్లిలేచేటట్లు కన్ప డటం లేదు. ఇదేం సంసారమయ్యా! ఇంట్లోబియ్యం లేవు! ఏమివండను" అంది లచ్చువమ్మ మొసవిరుపుగా పుల్లిగాణ్ని ఎత్తిపొడుస్తూ.

పుల్లిగాడు మీసం మెలేశాడు. అదెంత భాగ్య మన్నాడు. ఓంకారయ్య వద్దకొచ్చి 'గింజలు' కావాలి దొరా!" అని అడిగాడు.

"నా దగ్గిర గింజలిప్పుడు లేవురా. కుప్పలెలాగూ నూరుస్తాంగా, అప్పుడు కొలిపించువులే ఎన్నికావాలో" అన్నాడు ఓంకారయ్య.

"అట్టాకాదొరా. ఈ పూటకేమీలేవు. కొలిపిచ్చా ల్సిందే-"అన్నాడు ఖాకాఖండీగా.

"కొలవాలన్నా యిప్పుడొక్క గింజలేదు. కొట్లో వడ్లన్నీ నిన్ననే బేరమిచ్చేశా."

"ఇత్తే ఇయ్యొచ్చు, ఇప్పుడు నాకు రావాల్సినవన్నీ కొలవాల్సిందే." అన్నాడు కర్రపోటు వేసి.

"అంత పట్టుదలగా అడుగుతున్నావుగనుక గింజ కొలిసేదేలేదు" అన్నాడు ఓంకారయ్య.

"కొలవురూ!" అని పుల్లిగాడు పొగలు గ్రక్కుతూ వెళ్ళిపోయాడు. లచ్చువమ్మ మేడమీదికొస్తూ, ఎదురైనా ఏ సంగతీ చెప్పకుండా తలవంచుకొని అదేపనిగా వెళ్ళి పోయాడు. ఆ వాలకాన్నిబట్టి గింజ లివ్వలేదన్న సంగతి లచ్చువమ్మ పసిగట్టి ఓంకారయ్యగారివద్ద కొచ్చింది.

"దొరా! తవురంతా సెప్పబట్టి ఆడితో కాపురానికి దిగా. ఇంట్లో గింజల్లేవు కొలుదురూ!" అంది.

"లేవని వాడితో చెప్పానుగదుటే!"

"ఆడి జీతం లో లేవన్నారు సరే. నాకియాల్సిన వన్నా యియ్యండి."

"వాడికివ్వనప్పుడు నీకుమట్టు కెక్కణ్ణుంచివస్తాయ్? నీకూవాడితో పాటే కొలుస్తాను."

లచ్చువమ్మ కింక మాట్లాడడానికి వీలులేక పోయింది. ఇంకా పడిగాపులు పడి ఆయనఎదుట నిల్చుండడం దండుగని మెల్లగా వెనక్కి తిరిగింది. అంతలో కేశరణం కఠోర శాస్త్రీ రొప్పుకొంటూ అక్కడికొచ్చాడు. పట్టరానికోపంతో ఎదురుగా వున్న లచ్చువమ్మ ముఖాన తుపుక్కున వూసి "అడ్డంలేముండా" అంటూ ఓంకారయ్య దగ్గరకొచ్చి.

"కొంప మునిగింది, వుత్తరప్పాలానవంక తాటి దగ్గర కుప్పనెవరో నూర్చుకుపోయారు."

"నిజమేనా?" అంటూ ఓంకారయ్య ఎగిరిపడి దడదడ లాడుతూ అడిగాడు.

"నిజం. నలిపినగడ్డి, కుప్పచుట్టూ చిందవందరగా పడివుంది. ఓ రెండుమూడు బస్తాలవరకూ నలుపుకుపోయి ఉంటారు."

"నువ్వక్కడి కెందుకెళ్ళావ్?—"

"ఇవ్వాళ ఉదయం అక్కడో చేను మసాయిదా చెయ్యడానికని వెళ్ళాను."

ఈ కబురు వినేసరికి ఓంకారయ్య ఆగలేకపోయాడు. ఆ సంగతి లలితా,చంద్రమతులకు తెలిసినా ముభావంగానే వుండిపోయారు. ఎటు తిరిగీ ఓంకారయ్యకే వళ్ళంతా తేళ్ళు కుట్టినట్లయి నిలవలేక పోయాడు. కరోరశాస్త్రిని తీసుకొని అంగలు పంగలు వేసుకొంటూ వుత్తరప్పొలం వంక తాటి వద్ద కొచ్చాడు. కుప్ప కొపిరినుంచి అడ్డంవరకూ క్రిందకు పడవేసి 'బోడిగా' వుంది. సగం సగం నలిగిన వడ్ల కంకులు కుప్ప కన్ని వేపులా పడివున్నాయి దీనికి ఓ యిరవైగజాల అవతల రాందాసు కుప్ప తణుకు బెణుకూ లేకుండా నిలబడి గర్వంగా తన కుప్పనువేళాకోళం చేస్తోందా అన్నట్టువుంది. ఎందుకో ఓంకారయ్య కళ్ళు కసిగా అరమోడ్పు పడ్డాయి."

"శాస్త్రీ! ఇదెవరు చేసుంటారో నీకేమైనా అనుమానం వుందా ?"

"ఇంకెవరండీ ! ఆ రాందాసూ, ఏసోబుగాళ్ళే. వాళ్ళకు తోడు వుసికొలపటానికి ఆ రాజుగాడొకడు తద్దిన మయ్యాడుగా !"

అదీ నిజమే ననుకొన్నాడు ఓంకారయ్య. ఈ పనోళ్ళు తప్పించి మరెవరూ చెయ్యరని గట్టి నమ్మకం మేర్పడి పోయి నది. వాళ్ళే పని చెయ్యలేదనుకోవడం మాత్రం ఎలా ?

ఓ వేపు రాందాసు గాడికుప్ప సజావుగానేవుందాయె పొరుగు దొంగలైతే వాడి కుప్ప వదిలి తన కుప్పపైనే ఎందుకు పడతారు ? ఇది వాళ్ళు చేసిన పనే. లేకుంటే తన చేలో కాలు మోపడానికి ఇంకెవరికీ దమ్ములుండ వను కున్నాడు.

"కరెక్టుగా ఆలోచించి చెప్పావయ్యా-"

"అదేనండీ ! నిన్న చీకటేల రాందాసూ ఏసోబూ మా యింటి ముందుగా యిటువేపు రావడం చూశాను !"

"ఇంకేం వాళ్ళే ! ఆ వెధవల్ని వృత్తినే వదిలిపెడితే వీడి పేరు ఓంకారయ్యే కాదు" అంటూ ప్రతిన బూని, శాస్త్రి చెవిలో ఏదో వూదాడు.

"ఏం ! అర్థమైందా ? నువ్వీ పనిచెయ్!ఆ తర్వాత నే చూచుకొంటాను"

"అలాగే !"

ఇద్దరూ యింటికి తిరిగి వచ్చేశారు. ఓంకారయ్య కాసేపు పిచ్చెత్తినట్లు వరండాలోనే పచారుకొట్టి చప్పున సబ్ పోస్టాఫీసుకొచ్చి పోలీసులకొటకు ఫోన్ చేశాడు. ఫోను చేసిన ఓ గంటన్నరకల్లా పదిహేనుమంది సాయుధ పోలీసులు వ్యాన్‌లో వచ్చి వాలారు.

"ఎవరండే మీ కుప్ప నరిపిన వాళ్ళు అని అడిగాడు హెడ్.

ఎంతమందిమీద చెప్పాలా అని ఓంకారయ్య ఆలోచించ సాగాడు. రాందాసూ, ఏహోబు, ఆఖరుకి రాజుకూడా చెప్పడం మంచిదేమో అనుకొన్నాడు. కాని, ఇలా ముగ్గురు మీద ఒకేసారి చేస్తే పాత కక్షల్ని పురస్కరించుకొని చేసి నట్లవుతుందనుకొన్నాడు. అలాగా రాజును వాళ్ళిద్దరిమీదే పులిమితే ఎలా వుంటుందా ? అని ఆలోచించాడు. అదే బాగుందనుకున్నాడు. వాళ్ళిద్దరూ ఒట్టి గడుగ్గాయులు. ముందు వాళ్ళ పీడ వదలాలి.మూడోవాడి సంగతి తరవాత పడదామనుకున్నాడు.

ఈ విషయం చెప్పబోతుండగా భార్య పిలుస్తున్నట్లు లచ్చువమ్మ వచ్చి చెప్పింది.

"ఎందుకే పిలిచావట!" అన్నాడు చిరాకుగా వెళ్ళి.

"కుప్ప నంపితే నలిపారు, మీరెవ్వరిమీదా రిపోర్టు చెయ్యవద్దు" అంది ప్రాధేయపూర్వకంగా.

"నువ్వు వద్దంటే ఆగే ఘటం కాదిది. వాళ్ళకు తగిన శాస్తి జరగాల్సిందే !"

"ఐతే వాళ్ళు నలపడం మీరు చూశారా !" అంది లలిత.

"లేదు. వాళ్ళ మీద నాకు పూరా అనుమాన ముంది. వాళ్ళే చేసుంటారు తప్పకుండా."

"వాళ్ళలా కక్కుర్తిపడే రకం కాదని నేను గట్టిగా చెప్పగలను. నమ్ముతారా ? అంది లలిత.

"నమ్మను- వాళ్ళే చేశారు" అంటూ అక్కణ్నుంచి విదిలించుకొని వచ్చేశాడు.

పోయేకాల మొచ్చినపుడు అంతేలే అంటూ ఆవేశ పడి,ఏనా ఏం చెపుతాడో విందామని తలుపు దగ్గరకొచ్చి నిలబడింది.

"చివరి కెవరెవరున్నారో తేల్చి చెప్పండి" అని అడిగాడు మళ్ళీ హెడ్డు విసుగ్గా.

"ఇద్దరి మీద నాకు బాగా అనుమానముంది. వాళ్ళు తప్ప యీ పని ఇంకొకరు చేసి వుండరు.

"వాళ్ళెవరంటి ?"

"ఒకడు రాందాసు, ఇంకొకడు ఏసోబు."

ఇద్దరి పేర్లు వ్రాసుకొన్నాడు హెడ్.

వెంటనే తన ఆధీనంలో వున్న పోలీసు కానిస్టేబుళ్ళ కందరికీ ఏమో సంజ్ఞ చేశాడు. అందరూ లాటీలు తక్కన ప్రక్కన తొడలనుంచి మోకాళ్ళ క్రింది వరకూ ఆన్చి పట్టి అటెన్షన్ ఆర్డర్‌తో నిలబడ్డారు. ముద్దాయిలెవరో వాళ్ళ కూడా చెప్పి పట్టుకొమని ఫర్మానా యిచ్చారు. అలాగే నంటూ వాళ్ళు శాల్యూట్ కొట్టి కరకుబారిన గుండెలు మరింత కఠినపర్చుకొని టిక్కు టిక్కుమని నడవసాగారు. ఆ నడకలో ఇనప నాడాల బూట్ల తాకిడికి భూదేవి తట్టుకోలేక అదరి పోతోంది.

"వాళ్ళను వెంటనే పోల్చి పట్టుకోడం కష్టం. ఎవరి నైనా పంపిస్తారా మాతో పాటు" అన్నాడు హెడ్.

ఓంకారయ్య పుల్లిగాడికోసం వెదికాడు. వాడివ్వాళ ఎందుకనో తన కంటి కగపడలేదు. ఎక్కడికి వెళ్ళిందీ తెలీదు.

"ఎవరో ఎందుకు ! నేనే వస్తానండి—" అంటూ ఓంకారయ్య వాళ్ళతోపాటు బయలుదేరాడు. కొంతదూరం వెళ్ళిన తర్వాత వాళ్ళు రావడం కోటయ్య కనిపెట్టి ఏదో కుంభకోణం జరుగనున్నదని భయపడ్డాడు ఒక్క పరుగున రాజుదగ్గరకొచ్చాడు. అక్కడే రాందాసూ, అతని కూతురూ ఏసోబూ వుండి ముచ్చట్లాడుకొంటున్నారు. కోటయ్యతాత ఆకస్మికాగమనానికి వాళ్ళు కాస్త తొట్రుపాటు పడ్డారు.

తగ్గట్టుగానే కోటయ్య చెప్పేశాడు.

"బాబూ,యీరోజో కొంప మునిగేట్టుంది ఓంకారయ్య పోలీసోళ్ళ నంటేసుకొత్తుండాడు. నా మాటిని యీణ్ణుంచి పారిపొండి" అన్నాడు.

రాజు వెటకారంగా నవ్వి—

"మనమేం తప్పు చేశాం వాళ్ళు మన దగ్గరకు రావడానికి ?" అన్నాడు.

"అదే తెలవటంలా బాబూ"

"సరే, రానీ తెలుస్తుందిగా. ఇంత మాత్రానే జడిసి పారిపోవలసిన ఖర్మేం పట్టింది ?"

"అంతే బాబూ ! ఆళ్లకు దడిసేదెవుడే రోజుల్లో" అంటూ అందుకొన్నారు రాందాసూ, ఏసోబులు.

"ఎందుకు జడవరో చూస్తాం.మజా"అంటూ హెడ్ తోసహా పదిమంది యింట్లోకి దూసుకువచ్చి చుట్టివేశారు.

"మీరెందుకొచ్చారో మాకు తెలీసు. ఏవన్నా వుంటే బయటకు పిలిచి అడగండి.చెప్పకుండా చెయ్యకుండా

ఇలా ఇంట్లోకి రావడం సబబూ కాదు; చట్టమూ కాదు" అన్నాడు రాజు తారాజువ్వలా లేచి.

"దొంగల్ని పట్టుకోడానికి మాకన్ని అధికారాలు వున్నై. ఇదేం చట్ట విరుద్ధం కాదు" అని హెడ్డు దబాయించాడు.

"దొంగలా ? ఎవరు ?" రాజు విస్తుబోయి అడిగాడు.

"ఇందులో రాందాసూ, ఏసోబూ ఎవర"న్నాడు హెడ్డు.

"అదేం ! ఓంకారయ్యగారు తోడు వచ్చారుగా. చెప్పమనండి ?"

ఓంకారయ్య చెయ్యెత్తి వాళ్ళిద్దరినీ చూపించాడు. నలుగురు పోలీసులూ వాళ్ళని పట్టుకొని చేతులకు బేడీలు తగిలించారు.

ఈ అక్రమ దండనకు రాజు ఉగ్రుడై "మీరు వాళ్ళ చేతులకు బేడీలెందుకు వేస్తారు ? విప్పండి" అంటూ కొట్టబోతున్న వాడిలా పోలీసుల్ని సమీపించాడు.

"త్వరపడకు మిస్టర్. వీళ్ళు పచ్చి దొంగలు, ఓంకారయ్యగారి కుప్ప నలిపి వడ్లు దోచుకుపోయారు.

"చిత్రంగా వుందే మీరు చెప్పేది. వాళ్లా పని చెయ్యలేదని నేను హామీ యిస్తా. విడిచిపెట్టండి"

"కుదరదు మిస్టర్— అలా అని ఓంకారయ్యగారు రిపోర్టు చేశారు. దోపి దోపే. — దొంగ దొంగే !"

రాజు కళ్లు ఎర్రబడ్డాయి, ఓంకారయ్య కేసి చూచి,

"మీ రిపోర్టు సత్యమైందేనా ఓంకారయ్యగారూ. మలమలా మాడుతూ అన్నమో రామచంద్రా! అని అలమటిస్తున్న సమయంలోనే మీ గాదెల్లోని ధాన్యం నిక్షేపంగా వుందే! ఇప్పుడు ఆ కుప్ప జోలికెందుకు వస్తారు? నిజం చెప్పండి! విళ్ళేనా మీ కుప్ప నలిపింది!" అని ఆవేశాన్ని అణచుకొంటూ అడిగాడు

"ఔను" అని ఓంకారయ్య నిష్కర్షగా జవాబిచ్చాడు.

"ఛీ ఎంత పాపాని కొడిగొట్టావు? మేం నీ శేగో కొచ్చి నీ కుప్పలు నలుపుకొంటామా? చూసుకోండి మా యిల్లంతా సోదా. ఆ బాపతు ఒక్క గింజుంటే కాల్చెయ్యండి" అంటూ రాందాసు బలవంతాన బేడీలతోనే చేతులు లేపుతూ ఓంకారయ్య మీదికెళ్ళబోగా ప్రక్కనున్న పోలీసులు ఆపారు. ఇంకా ముదురుతుందేమోనని హెడ్డు వాళ్ళని తొందరించి తీసుకుపోతూంటే రమణమ్మ గబాలున వెళ్ళి తండ్రినికౌగలించుకొంది.

"నాన్నా" అంటూ ముప్పిరిగొన్న దుఃఖంతో భోరున ఏడ్చింది. రాందాసు కళ్ళల్లో నీళ్ళు తిరిగినా ఆపుకొన్నాడు.

"తల్లీ! నీకేం బయంలేదు. నేనెక్కడుండా, నాకన్నా ఎక్కువగా సూసుకొనే రాజు బాబుండాడు. ఊరుకోతల్లీ!" అన్నాడు రాందాసు ఆమె నతిబలవంతాన ప్రక్కకులాగి వాళ్ళిద్దరినీ తీసుకుపోయారు పోలీసులు.

"జాగ్రత్తగా మెసులుతూ వుండండి బాబోయ్!

ఆయన మనమీద పగబట్టి నట్టుండాడు" అంటూ కోటయ్య తాత కొలికిల్లోని కన్నీటిబిందువుల్ని పంచెకద్దు కొన్నాడు.

"పట్టనీ; చూద్దాం!" అంటూ రాజు రమణమ్మ చెంతచేరి ఓదారుస్తున్నాడు. కానీ ఆమె ఏడ్పుకట్టడంలేదు. అసలే తల్లిలేనిది. అందులో మళ్ళీ తండ్రి వియోగం - ఈ రెండూ ఆమెను దుఃఖార్ణవంలో ముంచివేశాయి. ఆమె దీనావస్థకు రాజు కళ్ళుకూడా చెమ్మగిల్లాయి ఐనా పైకి మాత్రం కనపడనీయలేదు.

"రమణీ! ఏడ్చి లాభమేముంది? వంటికి లేని ఆవేశం తప్ప - నేనున్నాను మీ నాన్న వచ్చేవరకు" అన్నాడు రుద్ధకంఠంతో. రమణమ్మ కళ్ళు తుడుచుకొని, రాజుముఖం లోకి చూచింది. ఆ ముఖంలోని ఔదార్యం, ఆ కళ్ళలో కానవస్తున్న నిస్వార్థ ప్రేమ, ఆమెకు ఫూరట కలిగించాయి.

"మళ్ళీ నాన్న నెప్పుడిడిశి పెడతార్రాజూ?" అని అతి అమాయకంగా అడిగింది, బుగ్గలపై సారెలుకట్టిన కన్నీరు కొంగుతో తుడుచుకొంటూ. "చెప్పలేము" అంటూనే రాజు అలా చూసేసరికి లచ్చువమ్మ పుల్లిగాణ్ని తోసుకుంటూ లోనికి వచ్చింది.

"శెప్పు. రాజుబాబుకు తప్పు శెప్పి శెమించమని ఏడుకో" అంది_

రాజుకి రమణమ్మకి ఏమీ అర్థంకాక తికమక పడుతున్నారు. కోటయ్యతాత పరిస్థితికూడా అలాగేవుంది. అపరా

ధిలా నిలబడివున్న పుల్లిగాడేం తప్పు చేశాడో ఎవరికీ బోధపడడంలేదు.

"బాబూ ఓంకారయ్యకు కుప్ప నలిపింది నేనే. జీతం వద్దు యియ్యవాంటే యియ్యలా. ధైర్యంచేసి కుప్పనలిపి వాటిని కోమిటి కొండయ్యకమ్మేశా. పేటకెళ్లి కావలసిన కంచర సామాను కొనుక్కొని యిప్పుడే వొచ్చా. లచ్చి సెప్పింది ఇట్టా రాందాసునూ ఏసేబ్‌నూ పట్టుకుపోయారని. నన్ను శెమించుండి బాబు - చేసింది నేనే - ఎల్లి యిడిపించి ఆ జైల్లో నేనేవుంటా" అన్నాడు పశ్చాత్తప్త హృదయంతో.

రాజు ఆశ్చర్యానికి, కోపానికి అంతులేకపోయింది. కోటయ్య గమణమ్మకూడా అలాగే విస్తుపోయారు. గతంలో వీడి కుతంత్రాలు చూచి గుంజకు వురితీయాలని తీర్మానించి కూడా తాత మాటవిని విడిచి పెట్టేశాడు. అంతలోనే మేలు మరచి ఓంకారయ్యతో కలసి ఎదురుతిరిగాడు వాడు. ఈ నాటికి ఓంకారయ్య వేసే మోసపు ఎత్తుగడలకు భుజమేసుకొంటూనేవున్నాడు. అందుకని కోపం వస్తున్నా, వాడిలో ఇంతటి అనూహ్య పరివర్తన కలగడం రాజుకు ఆశ్చర్యంగానేవుంది. వాణ్ని వెనకటిలాగా పట్టి కట్టెయ్యడంగాని, వురి దీయడమన్న వూహాగానీ లేదు రాజుకిప్పుడు. ఒకనాటికి కాకపోయినా మరోనాటికైనా వాడితప్పు వాడే గుర్తించక తప్పదన్న నిర్ణయానికొచ్చాడు.

"పుల్లీ! క్షమించడమనేది మా శక్తిమించిన వ్యవ

హారం. చేసింది నువ్వే కావచ్చు. కానీ వాళ్ళెలాగూ దోషులై వెళ్ళిపోయారు. మధ్యలో నువ్వు తలదూర్చటం దేనికి? నువ్వు యథేచ్ఛగా వెళ్ళి నీ పని చూచుకో. వాళ్ళ సంగతేమీ ఆలోచించకు"

"అంతేనంటావా బాబు?" అని బేలముఖంతో అడిగాడు.

"అంతే..."

"ఐతే నేను తమకు చేసిన అన్యాయం."

"అదేం పెట్టుకోకు - నీ తప్పును నువ్వు తెలుసుకొన్నావ్, అదే క్షేమం కోరేది!

"బాబూ ! నే న్నేసిన కుచ్చితానికి తవురికెట్టా మేలెయ్యాలో తెలీటంలా. శెప్పండి శేత్తాను."

"అది నే చెప్పితే తెలిసేది కాదు. మనసుకేది మంచి దని తోస్తే అది చెయ్యటమే-" పుల్లిగాడింక మాట్లాడలేదు. లచ్చిని తీసుకొని తోటకు వెళ్ళిపోయాడు. ఇంతవరకూ ఏదో పరధ్యానంలో వున్న రమణమ్మ, కోటయ్యలు తేరుకొన్నారు.

"ఇప్పటికి తెలిసింది నాయాలుకు" అన్నాడు కోటయ్య.

"అదే పదేలు" అంది రమణమ్మ. రాజు మాత్రం ఏదో సుదీర్ఘమైన ఆలోచనల్లో మునిగిపోయినట్లు అతని ముఖ భంగిమలు తెలియజేస్తున్నాయి.

"రాజూ ! అయిపోయింది; అంతా బుగ్గిపాలయి పోయింది" రమణి గుండె బాదుకొంటూ పరిగెత్తి వచ్చింది

"ఏమైంది ?" రాజు హడావిడి పడ్తూ అడిగాడు.

రమణమ్మ యివ్వాళ వుదయాన్నే లేచి కుప్ప నూర్పించడానికి కళ్ళం కొద్దామని వెళ్ళింది. ఇంకేముంది ? కుప్ప రాత్రి ఎప్పుడు కాలిపోయిందో ఎర్రని నిప్పుల నుసి మటుకు మిగిలిపోయింది. ఇంక నిలువలేక పగిలి విచ్చే గుండెలు అదిమిపట్టి పరుగెత్తి వచ్చింది. "కుప్ప తగలబడి పోయింది. బూడిదకూడా గాలికి నానామట్టుకి ఎగిరిపోయింది అని చెప్పింది. అది విని, రాజు నిశ్చేష్టుడయ్యాడు. కొంతకాలం అతని కేటూ తోచలేదు. అంతలోనే కనుబొమ్మలు ముడిపడ్డాయి. కళ్ళు చింత నిప్పులయ్యాయి.

రాందాసూ, ఏసోబును తీసుకొని వెళ్ళినప్పుడైనా అతనింత క్షోభ పడలేదు. సంవత్సరం కష్టించి పండించుకొన్న పంట అగ్గిపాలైంది.ఇది కేవలం ఓంకారయ్య కానా లని చేయించినట్లుగానే వుంది. ఇంకా యిందులో అనుమానం లేదు, యెంతకాలమని యిలా సహించేది ? దీనికి విమోచన లేదా ? న్యాయంగ ధర్మం అనేవి కనిపించవా " ఎంతకాల మిలా జీవచ్ఛవాలై నీటిపై చెండులా తేలియా డేది ?

రాజు తన్ను తాను తమాయించుకోలేక పోయాడు.

గుండె కొట్టుకుంటున్న సవ్వడి వినే వాళ్ళను కలవర పెట్టేంత డేంజరుగా పైకి వినవస్తూంది.

"తాతా ఇంక మనం కళ్ళు మూసి వుంటే లాభం లేదు. తనువులు శాశ్వతం కాదు- నడవండి- మన వెల్లువను కదలించండి- మనలో చైతన్యం లేకపోబట్టే అడుగడుగునా మన జీవితాలు క్షుద్ర పీడితా లవుతున్నాయి- ఏమంటావ్" రాజు గొంతు భయంకరంగా ధ్వనించింది.

తాతయ్య కూడా "పదండి" అన్నాడు. రమణమ్మకు ఒకరు చెప్పే పని లేకపోయింది. వీరనారి రుద్రమ్మలా కళ్ళ నిప్పులు చెరుగుతూ ఒక పరుగులో కోటి శ్రామిక స్త్రీలందరినీ వెంటబెట్టుకొని వచ్చింది. రాజు కూడా పొలికేక బెట్టాడు. అందరూ దూకులు దూకుతూ వచ్చి పడ్డారు. వాళ్ళిప్పుడు మానవులుగా కనుపించడంలా ? పచ్చి మాంసానికి పరుగులు దీసే సింహాంలా, రక్తాన్ని వాడిచి త్రాగే పెంజేరుల్లా- వాళ్ళ ప్రతి అవయవ కదలికలోనూ రాక్షసత్వం స్ఫురిస్తోంది ఈ సమయంలో వీళ్ళ నడ్డుకొనేదీ లేదు. అడ్డినా నిలవగలిగేది లేదు.

"మిత్రులారా ! మనం ఆకటితో అలమటిస్తున్న సమయంలో కూలిరేట్ల కొరకు పోరాడాం. ఫలితం శూన్యం కాగా అనేక యిబ్బందులకు గురై ఎముకల గూళ్లలా తయారయ్యాం. ఐనా అన్యాయాలూ, అక్రమాలూ మితిమీరి పోతున్నాయి. వీటిని ధైర్యంగా ఎదిరించకపోతే ఇక లాభం లేదు.

హుం, పదండి !

"మరో ప్రపంచం

మరో ప్రపంచం

మరో ప్రపంచం పిలిచింది !

"పదండి ముందుకు

పదండి త్రోసుకు,

పోదాం పోదాం పై పైకి !

కదం త్రొక్కుతూ,

పదం పాడుతూ,

హృదాంతరాళం గర్జిస్తూ,

దారి పొడుగునా గుండె నెత్తురులు తర్పణచేస్తూ
పదండి ముందుకు !!

అని ఆ జన ప్రవాహం ఓంకారయ్య ఆవరణలోకి వచ్చి పడింది. ప్రశాంతమై యున్న ఆ పల్లె వాతావరణం బీభత్సమై భీషణఘోష పెడుందితో.

ఓంకారయ్య మేడ పై అంతస్తులో వుండి యీ వెల్లువను పరికించాడు. ఖంగు తిన్నాడు; పిచ్చెత్తినట్లు

అటూ యిటూ పరుగు మొదలెట్టాడు. ప్రక్కన వున్న పాలేరు పుల్లిగాడు, కరణం కఠోరశాస్త్రి గడగడలాడి పోతున్నారు.

"పదండి మేడెక్కి వాళ్ళని పట్టుకోండి! అని రాజు ఆదేశించాడు.

జనం మేడమెట్లెక్కడం ప్రారంభించింది.

చంద్రమతీ,లలితలు కూడా మేడ వరండాలోకొచ్చి యీ దృశ్యం చూస్తూ బిత్తరపోయారు. లలిత ఉద్రేకంతో గంతువేసి జనంలో కలువబోయింది. ఓంకారయ్య పరుగెత్తి వచ్చి కూతుర్ని పట్టి, "దీన్ని యీడ్చుకు వెళ్ళి గదిలోకి తోసి తాళం బిగించు" అంటూ కరణం కఠోరశాస్త్రి నుద్దేశించి హుంకరించాడు. కఠోరశాస్త్రి లలిత చెయ్యి పట్టుకొని యీడ్చుకుంటూ గదిలోకి నెట్టి తలుపులు బిడాయించాడు.

"రాజూ! దారుణం. లలితను యీడ్చుకు పోతున్నారు" అంటూ రమణమ్మ మేడమీదికి పరవళ్ళుతోలింది. అందరూ ఆమె వెంట పరుగెత్తారు. ఓంకారయ్య మేడ మీదనే ఓ వేపుకు వెళ్ళి నిలబడ్డాడు.

"పట్టుకోండి! పట్టుకోండి! అని రాజు అరిచాడు. అందాకా ఓంకారయ్య పక్కనవున్న పుల్లిగాడికి ఏం పుట్టినదో, వెంటనే మహా పౌరుషంతో దాడుతీసి ఓంకారయ్యను పట్టుకోబోయాడు. "ఢాం" అనే ప్రేలుడు శబ్దం వినబడింది. పుల్లిగాడు నెత్తురు కారుతున్న గుడ్డతో వెనకడుగు వేసి;

"చాలు ! యినక్కి మళ్లండి, ఆయన దగ్గర పిస్తోలు వుంది" అని రాజునూ, తతిమ్మా వాళ్ళనూ ఉద్దేశించి కేక వేశాడు. వాళ్ళ కా మాట వినిపించలేదు. పుల్లిగాడి భుజం వెంట రక్తం కారటం చూచి మరీ రెచ్చిపోయారు. రాజు దూకి పడుతున్నాడు. రమణి అంతకన్నా ముందే దూసుకు పోయి ఓంకారయ్యను పట్టుకోబోతుండగా మళ్ళీ పెన్నమూత మేడ ప్రతిధ్వనించింది.

"రాజూ !" అని రమణమ్మ కేక పెడుతూ బిళ్ళ బీటుగా వెనక్కి విరుగదీసుకొని పడిపోయింది. రాజు పట్టుకో బోయాడు. కాని లాభం లేకపోయింది. రొమ్ములోనుంచి రక్తం ధారవడి కారుతూ నేలపై కాలువలు కట్టింది.

రాజు దుఃఖాన్ని అణచిపట్టుకొని పళ్ళు కొరుకుతూ ఓంకారయ్య మీదికి దూకాడు. పిస్తోలు లాక్కొని గురి పెట్టాడు. ఓంకారయ్య ఎగిరి క్రిందికి దూకాడు.

జనం బెల బెలమంటూ క్రిందికి పరుగులు దోలింది. ఐతే తాత మాత్రం కదల్లేక పోయాడు.

"రాజూ !"అని రమణమ్మ హీనస్వరంతో పిలిచింది. ఇంతలో తాత, లలిత కూడా అక్కడికి వచ్చారు. రాజు రమణమ్మ దగ్గరకు వెళ్ళాడు, ఆమె కళ్లనిండా నీళ్ళు తిరుగుతున్నాయి. రమణమ్మ తాతచేతిని విడువకుండ పట్టుకొని వుంది. కోటయ్య తాత నెత్తురు చూడలేక చేత్తో కళ్ళు మూసుకున్నాడు.

లలిత ఆ దృశ్యం చూచి కెవ్వున అరుస్తూ రమణమ్మ మీద వాలిపోయింది.

లలితా ! నే నింకో క్షణంలో యీ లోకాన్ని విడిచి పోతుండా! నీ పట్ల నే నేమన్న తప్పుగా ప్రవర్తిస్తే మన్నించు, నువ్వు నా చెల్లిలాంటి దానివి ....

".... రాజూ ! .... యిట్టా రా... నీ మీద నే నెన్నో కలలు కన్నాను— నా శివరి కోరిక మన్నించు .... ఏదీ నీ శెయ్యి ఇటివ్వు... లలితా ! నువ్వు కూడా శెయ్యి ఇట్టాతే ! .... ఆ .... మీ యిద్దరూ .... మీ యిద్దరూ సుఖంగా పెళ్ళి ...." హఠాత్తుగా రమణమ్మ గొంతు ఆగి పోయింది.

"రాజూ. లలిత, ఆఖరికి అక్కడున్న వాళ్ళందరూ "రమణీ! రమణీ" అంటూ మేడ పగిలిపోయేట్టు భోరున ఏడ్చారు. ఇంతలో కొంతమంది గోండ్రుపెట్టి మూల్గుతున్న ఓంకారయ్యను కిందినుంచి పైకిలాక్కొచ్చారు.

అతన్నిచూచి చంద్రమతి ఏడుస్తూ, వచ్చిమీద పడబోయిందిగాని, ప్రక్కనున్న వాళ్లు ఆమెను చేరనివ్వకుండా నెట్టివేశారు. మేడమీదనుంచి దూకేసరికి ఓంకారయ్య కాళ్ళు చేతులూ విరిగి ఎముకల ప్రోవులా ఐపోయాడు.

అతని నోటినుంచి గోండ్రు గోండ్రు మన్న ధ్వని వినవస్తుంది.

ఇంతలోనే పుల్లిగాడు తనకి తగిలిన దెబ్బ లెక్క చెయ్యకుండా కొంతమందిని వెంటబెట్టుకుని కరణం కఠోర శాస్త్రిని పట్టించి అక్కడికి నెట్టించుకొచ్చాడు. అందరూ కఠోరశాస్త్రిమీద విరుచుకు పడబోయారు. రాజు వాళ్ళని గద్దించి ఆపాడు.

ఓంకారయ్య ఇదంతా చూశాడు. మూలుగుతూనే "రాజూ! అతన్నేమీ అనకండి. అన్నిటికీ నేనే కారకుణ్ని. వెఱ్ఱి అహంకారంతో గాందాసు కుప్పకు అతనిద్వారా నేనే నిప్పుపెట్టించాను. ఆ వేశంలో ఒక నిండుప్రాణాన్ని కూడా బలిగొన్నాను. మీకు కూలి నాలీ లేకుండా బ్రతికున్నన్నాళ్ళు ఎన్నో హింసలు పెట్టాను. 'చెఱసాల్లో'పడి మగ్గే ప్రాణులకన్నా అధిక బాధలు పెట్టాను, మీ 'చెఱసాల' జీవితం నేటితో ఆఖరైంది; ఇక నాపని అయిపోయింది. మీరు జయభేరి మ్రోగించుకోండి. నా సర్వస్వం మీకు దఖలు చేస్తున్నా ...." అంటూ ఇంకా ఏమో చెప్ప బోతుండగా మధ్యలో అమాంతం మాట పడిపోయింది. గుడగుడ లాడటం మొదలుపెట్టింది. క్షణంలో అదికూడా మాయమయింది. ఎన్నో బాధల్ని, ఎంతో బరువునూ దించేసు కొని తేలిగ్గా దాటిపోయినట్లు ముఖం తేటపడింది. ఎంతో హాయిగానూ, సంతృప్తిగానూ సాగిపోతున్నట్లు కనులు ప్రశాంతంగా మూతలుబడ్డాయి. గుండెలు పగిలి చీల్చు కొనివస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక భార్య చంద్రమతి ఆ మృతకళేబరం పైనబడి 'హోరు'మని విలపించింది.

---

హృదయం అగ్నిపర్వతంలా పగల సిద్ధంగా వున్నా, దుఃఖమంతా మింగి నిండుకుండలా వుండిపోయింది లలిత. ఊహకందని, భావాలకు దొరకని ఏదో, ఏదో వాడిన నవ్వొకటి రాజు పెదవులనుండి అలా గాలిలోకలసి తేలి పోయింది.



—సమాప్తం—



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B186 |
| పుస్తకం పేరు | చెఱసాల |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 137 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4, |
| MISSIING PAGES | 17,18 |
| తయారు చేసినది | RUKSANA |
| పేజీలు విడదీసినది | RUKSANA |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |